# హార్లిక్స్

Horlicks
THE IDEAL FOOD DRINK

## ఆరోజుకు ఆరోజు రోగనివారణ శక్తిని పెంచి ఆరోగ్యాన్ని కాపాడే పౌష్టికాహారం.

హార్లిక్స్ నిత్యం సేవించినట్టయితే, మీ కుటుంబానికి రోగాలు రాకుండాతట్టుకునే శక్తి పెరుగుతుంది. వారికి సంపూర్ణ-మయిన ఆరోగ్యం చేకురుతుంది. ఆరోగ్యం మహాభాగ్యం.

హార్లిక్స్. ప్రపంచం అంతటా డాక్టర్లు సిఫార్సు చేసేది ఇది ఒక్కటే. మీకు అత్యధికంగా పుష్టి ఇచ్చేది ఇది ఒక్కటే ఎందుచేతనంటే ఇందులోను సంపన్నమయిన స్వచ్ఛమయిన పదార్థలు; అపూర్వమయిన హార్లిక్స్ పద్ధతి ప్రకారం సమ్మిళితమితాయి, దీనివల్ల వీటి సహజ సద్గుణాలు నష్టంకావు. అవి సులువుగా జీర్ణం అవుతాయి.
అందువల్లనే సుచిత్ర హార్లిక్స్‌ని తన కుటుంబ జీవితంలో భాగంగా చేసుకుంది

సుచిత్ర మోస్తరుగానే మీరుకూడా మీకుటుంబానికి ప్రతిరోజు హార్లిక్స్ ఇవ్వండి వారు ఆరోగ్యంగా, బలంగా పెరగడం మీకు కనబడుతుంది.

"హార్లిక్స్ ప్రధానమయిన పుష్టి సాధనం. మీకుటుంబంలోనివారికి వ్యాధులు రాకుండా తట్టుకునే శక్తి పెరిగేందుకూ వారు ఆరోజుకారోజు ఆరోగ్యంగా, చురుగ్గా ఉండేందుకూ నేను హార్లిక్స్‌ను సిఫారుసు చేస్తున్నాను"



**హార్లిక్స్** మంచి పుష్టికరమైనది

హార్లిక్స్ రిజిష్టర్డ్ ట్రేడ్ మార్క్.







విజయ్

పిల్లలాగానే పైర్లు కూడా ఏపుగా పెరగాలంటే పుష్టికరమైన ఆహారం ఇవ్వాలి. అందుకై నత్రజని, భాస్వరం, పోటాష్‌లను అవసరమైనంతగా పైర్లకు వేయాలి. విజయ్ కాంప్లెక్స్ ఎరువుల్లో ఈ మూడు ముఖ్య పోషక పదార్థాలు సరియైన పాళ్ళలో వున్నాయి.

మీ భూముల, పంటల అవసరాన్ని గుర్తించి తయారు చేసిన కాంప్లెక్స్ ఎరువులే విజయ్ 17-17-17, విజయ్ 14-28-14, విజయ్ 24-24-0.

ఆసియాలో పెద్దది, అధునాతనమైనది అయిన మద్రాస్ ఫర్టిలైజర్స్‌వారి కర్మాగారంలో విజయ్ ఎరువులు మీకై తయారుచేయ బడుతున్నాయి.

విజయ్ ఎరువులనుగురించి ఇంకా వివరాలకు
ఈ క్రింది వారిని సంప్రదించండి.



ఏరియా మేనేజర్
మద్రాస్ ఫర్టిలైజర్స్ లిమిటెడ్
44, శాంతి నగర్ కాలనీ, హైదరాబాదు-500 028









## అట్టమీదబొమ్మ

ఈ వారం (1.7.77)వ వార మీ (మా) పత్రిక నటి జయసుధ ముఖచిత్రముతో వెలువడినదివారం ప్రత్యేక శోభను (అందమును) చేకూర్చినది.

పసుపుపచ్చని బార్డరు, ఆకుపచ్చని రంగు మధ్య తెలుపుపూల డిజైను బట్టలతో సహజకాలపు దుస్తులతో చిరునవ్వు దరహాసము చిందిస్తూ పాఠకులను ఆకర్షింప చేస్తూవున్నది. పత్రిక ముఖచిత్రం ప్రచురించుటలో మీ (మా) పత్రిక తరువాతనే మరియే పుస్తకములు అన్నట్లుగానే వుంటున్నది.

సీరియల్స్ కథలు బాగున్నాయి. రిజల్ట్స వచ్చేశాయి! (కార్టూన్—రాగతి పండరి) బాగుంది. పత్రిక ఉత్తరాల శీర్షికను చివరి పేజీకి తరిమేసినందుకు విచారిస్తూ వున్నాను. సినిమా శ్రీనివాస్ బాగుంది. నేను ఇదివరకు 5 లేక 6 ఉత్తరములు వ్రాసితిని మరి దీని సంగతో? దీనిని ప్రచురించుటకు మీ (మా) పత్రిక చోటు చేసుకుంటుందనిఆశిస్తూ, అర్థిస్తున్నాను.

బి. లక్ష్మణరావు, (విశాఖపట్నం)

## సినిమా

ఎంతోకాలం నుండి పత్రికను చదువుచున్నాను. ఒక్క సినిమాశీర్షిక ముఖచిత్రాల ఎంపికతప్ప మిగిలినవి అన్నీ చాలా బాగుంటాయి. శ్రీ శ్రీనివాస్‌గారి దృష్టిలో ప్రతి చిత్రం ఒక కళాఖండమే ప్రతి చిత్రము నిర్మాతకు కనకవర్షం కురిపిస్తాయి!

ఒక చిత్రంలో ఎంత అసహ్యంగా చేసినా ఒక పటుడు లేక నటి జీవితంలో ఆ చిత్రం ఒక వెలుగురాయి.

కాళ్ళూరు ఫల్గుణ. (మైసూరు)

## సీరియల్

24.6.77న వెలువడిన పత్రికలోని కొత్త సీరియల్‌పేరు తమసోమా జ్యోతిర్గమయ లోగడ వెలువడిన ఒక సీరియల్ పేరు. విడి కథలు ఏమీ బాగా లేవు. ఫణి కథ చివరికి ఏమి జరిగినది రచయిత్రి పాఠకులకు వదిలి పెట్టినారు. ఈ కథలో అచ్చు తప్పులు రెండు మూడు వున్నవి. యింటిలో నౌకరు మొదట రంగన్న అని తరువాత రంగమ్మ అని వేసినారు.

అనుమాల జగన్నాథరావు, (క్రోసూరు)













# ఉత్తరాలు

## కథలు

25.6.77 పత్రికలోని తమసోమా జ్యోతిర్గమయ ప్రారంభములోనే మమ్ముల ను ఆకట్టుకొన్నది. ఆ సంచికలోని కోమలి—కోరిక బాగా లేదు. పెళ్ళిచూపులలో నచ్చక పోతే సంబంధమును తిరస్కరించడము సహజమే కదా కాని శశి దానిని ఇన్‌సల్ట్‌గా భావించి తన భర్తను ఎప్పుడో పెళ్ళిచూపులలో తిరస్కరించినతనికి ఇంటికెళ్ళి చూపించి అతనిని అవమాన పరచాలను కోవడము, ఆమె భర్త పార్టీకి పిలిచి అవమానిద్దామని అంగీకరించడము చాలా అసహజముగా యున్నది. పెళ్ళిచూపులకొచ్చి తిరస్కరించిన వారిని, అవమాన పరుస్తూపోతే అమ్మాయిలు ఎంత మందిని అవమాన పరచాలో !

ఎం. సుధాసల్మి, (ప్రొద్దుటూరు)

* * *

1.7.77 సంచికలో సి. వి. సూర్యనారాయణ మూర్తిగారి రూపాయి ఎస్. ఒ. కథ చిన్నదయినా చాలా నచ్చింది నాకు. చాలా చోట్ల పబ్లిక్‌టూర్లలో లెటర్స్ యివ్వటానికి బద్ధకిస్తుంటారు. వాళ్ళలా చేయుటంవలన ప్రజలకి ఇబ్బంది కల్గుతుంది ముఖ్యంగా అధికారులు అటువంటి ఉద్యోగులనిఖీ చేస్తుండాలి. కానీ ఎవరూ అలా చేయరు. అందుకే వారికి చేసే పనియందు నిర్లక్ష్యం ఏర్పడుతుంది. దీనికి పరిష్కారంగా ఎస్. ఒ. పద్ధతి అవలంబించటం మాకెంతో నవ్వు తెప్పించింది. సరిగా వచ్చేది అదేకదా మరి!

ఏడిద. సూర్యకుమారి, (విజయవాడ)

## కార్టూనులు

ఎన్నాళ్ళకెన్నాళ్ళకు నిజమైన భావగర్భితమైన కార్టూన్లు (మీా) మా పత్రికలో చూడగల్గుతున్నాము. 1.7.77 పత్రికలో జోక్సు మమ్మల్ని ఎంతో కడుపుబ్బ నవ్వించినవి. ఒక కన్య చెప్పిన కథ సీరియల్ మమ్మల్ని ఎంతో ఆకర్షించు చున్నది.

జి. నరసింహారావు. (బాంద్రాపేట)

## వంటలు

ఒక కన్య చెప్పినకథ సుగుణ చెబుతున్న కథతో మంచి టెంపో పుంజుకుంది. సహజత్వానికి అతి సన్నిహితంగా వ్రాసిన రచయిత మంథా వెంకట రమణరావుగార్కి నా ధన్యవాదాలు. ఈ మధ్య కాలంలో మీా పత్రికలో వచ్చ సీరియల్స్‌లో దీనిదే అగ్రతాంబూలం.

విప్పట్లు చదువుతూంటేనే బాపుస్తట్లని పించినా, దమాలా వో మాదిరిగా వుంటుందని పిస్తున్నా, జామకాయ చెట్లు, ఏపిల్ చెట్లు చదువుతూంటేనే బాగ లేవు.

ఎస్. ఎస్. నరసింహం, (పుద్దాపు

ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938–1972]
శుక్రవారం : 22–7–'77
పింగళనామ సం. నిజ ఆషాఢమాస శు. షష్ఠి
సంపుటము 70 : సంచిక :47

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*
పోస్టులో ఏడాది చందా రు. 41–60
ఆరుమాసాల చందా రు. 20–80
విడి ప్రతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ–520003.


## విషయానుక్రమణిక



ఆంధ్రసచిత్రవారపత్రిక

# 1977 దీపావళి కథలపోటీ

## మొత్తం రు. 5000 ల బహుమతులు

**ఈసారికూడా దీపావళికి కథానికలపోటీ పెడుతున్నాము... పోయినేడాదిలాగే యీ ఏడు కూడా సంపాదకుని ఎన్నికలో ఉత్తమంగా వచ్చిన ఐదు కథలను ఆంధ్ర సచిత్ర వారపత్రిక దీపావళి సంచికలో ఆ తరువాతి సంచికలో వేస్తాము. అటు తరువాత పాఠకుల బ్యాలట్ నిర్వహిస్తాము.**

## ముగింపు తేదీ 17-9-'77 శనివారం

పోటీలో ఎన్నికైన ఐదు కథలకు ఒక్కొక్కదానికి రు. **600** లు చొప్పున బహుమతులు యిస్తాము. అటు తరువాత బ్యాలట్‌లో ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానాలలో వచ్చిన మూడు కథలకు రు. **600**, రు. **500**, రు. **400** ల వంతున అదనపు బహుమతులు యివ్వడమే గాక మిగిలిన రెండు కథలకు రు. **250** ల చొప్పున కన్సొలేషన్ బహుమతులను అందజేస్తాము.

★ 'కథానిక' ఆంధ్ర సచిత్ర వార పత్రికలో నాలుగు పేజీలు మించకుండా వుండాలి. 12 అరటావులు దాటకుండా వ్రాస్తే చాలు. నిడివి ఎక్కువ అయిన కథలకు బహుమతి రాగల అవకాశాలు చాలా తక్కువ అని గమనించాలి.

★ కథావస్తువు తెలుగువారి సామాజిక జీవితానికి సంబంధించి వుండాలి.

★ అనువాదం, అనుసరణ, అనుకరణ, కాపీ కథలు పంపకూడదు. ప్రసారమైన, ప్రచురణ అయిన లేదా ఇతర పత్రికలకు పంపబడి పరిశీలనలో వున్న కథలు అసలే పంపకూడదు.

★ పై అంశాల మేరకు హామీ పత్రం ప్రతి కథతోపాటు విధిగా వుండి తీరాలి. కలంపేరు వాడినా అసలు పేరు, యింటిపేరు సహా పూర్తిగా విడిగా స్పష్టంగా పూర్తి చిరునామాతోపాటు అందిన కథలనే పరిశీలించ వీలవుతుంది.

★ కథలతోపాటు రచయితల పేర్లు పడవు. బ్యాలట్ తరువాత పరిచయంతోనే వేస్తాము.

★ రచనలపై పేచీలు వస్తే రచయితలే బాధ్యత వహించవలసి వుంటుంది.

★ పోటీలో నెగ్గిన కథల రచయితలు తమ ఫోటో, జీవిత విశేషాలు మొదలైనవాటిని పంపి వాటి ప్రచురణకు అంగీకరించాలి.

★ ముగింపు తేదీ దాటిన తరువాత అందిన కథలను మామూలు ప్రచురణకు వీలువెంబడి పరిశీలిస్తాము. పోటీకి పంపిన కథలను ఏటి పరిస్థితులలోను త్రిప్పి పంపలేము.

సం॥

# కస్తూరి









మూడవభాగం

మైనంపాటి భాస్కర్

## గొలుసు కథ

*(గత సంచిక తరువాయి)*

సాయంకాలం అయిదున్నర అయినా వేసవి ఎండ ఇంకా తగ్గలేదు. బ్యాంక్‌లోంచి స్టాఫ్ గుంపులు గుంపులుగా బయటికి వస్తున్నారు.

అరయింతర్వాత గేట్లోంచి బయటికి అడుగెట్టింది కస్తూరి. బస్‌స్టాప్ వైపు నడుస్తుండగా రవి కనబడ్డాడు.

అప్రయత్నంగానే చిరునవ్వు నవ్వింది.

తొట్రుబాటుతో దగ్గరికొచ్చాడు రవి.

"తొందరగా ఇంటికెళ్ళిపోవాలా మీరు?"

కస్తూరి వాచ్ చూసుకుంది. "ఏం ?"

"ఒక్క అయిదు నిమిషాలు మాట్లాడాలి మీతో."

"చెప్పండి."

"అలా హోటల్లో కాఫీ తాగుతూ మాట్లాడుకుందాం."

"సరే."

కూర్చుని కాఫీ ఆర్డరిచ్చాక మెల్లిగా మొదలెట్టాడు.

"మధ్యాహ్నం మీ నాన్నగారు మా ఇంటికొచ్చారు."

"తర్వాత ?" అన్నట్లు ప్రశ్నార్థకంగా చూసింది.

కొంచెం తటపటాయించి అన్నాడు.

"మీరు నన్ను పెళ్ళి చేసుకోదలుచుకున్నట్లు చెప్పారాయన. చాలా కోపంగా ఉన్నారు." అని ఆమె మొహంలోకి చూశాడు.

కస్తూరి మాట్లాడలేదు.

రవికి ధైర్యం వచ్చింది. అంటే జానకిరామయ్యగారు చెప్పింది నిజమేనన్నమాట.

"మిమ్మల్ని కబుర్లో, మాయ మాటలో చెప్పి మార్చేశాననీ, అలాంటివాణ్ణనీ, ఇలాంటివాణ్ణనీ అన్నారు. ఫర్వాలేదనుకోండి అయినా... కస్తూరిగారూ! నా మనసుకి నిజం తెలుసు. నాకు తెలిసినంతవరకూ నేనెప్పుడూ తప్పుగా బిహేవ్ చెయ్యలేదు. మీరీ నిర్ణయం ఎందుకు తీసుకున్నారో అర్థం కావటంలేదు. ఇంట్లో వాళ్ళమీద కోపంతో ఏదో అనేసి ఉంటారు. అవునా ?"

"ఇంట్లో వాళ్ళమీద కోపంతో అనెయ్యడం నిజమే. ఆలోచించకుండా చేస్తున్నానన్నది మాత్రం నిజంకాదు. అది నా స్వభావమూ కాదు." అంత చదువుకున్న అమ్మాయీ కొద్దిగా తల వంచేసుకుంది. తర్వాత మెల్లిగా. "నాకు పూర్తిగా ఇష్టమే. మరి మీకు నేను నచ్చానా ?" అంది.

"నచ్చక పోవడమా ? మీరు నాకు నచ్చక పోవడమా ? కస్తూరీ! ఇంకేదన్నా జోక్ చెప్పండి. దీనికి నవ్వు రావటంలేదు" అన్నాడు రవి.

అంతే!

మరుసటి నెలలోనే రవికి కస్తూరికీ పెళ్ళి జరిగింది. పెద్ద ఆడంబరంగా కాకపోయినా ఉన్నంతలో బాగానే జరిపించారు జానకిరామయ్యగారు! ఎంత వాదించినా చివరికి కస్తూరి మొండి పట్టుకి లొంగిపోక తప్పలేదాయనకు.

*　　*　　*

కస్తూరికి శెలవు ఇంకా నెల రోజులు ఉంది.

ఒక ఆదివారం నాడు కస్తూరీ, రవీ

కలిసి ఇళ్ళ వేటకు బయలు దేరారు.

విద్యానగర్ దగ్గర మొదలెట్టి రామ్‌నగర్ దాకా వెదికే సరికి ఎండ చల్లబడింది. ఒంట్లో ఓపిక చచ్చిపోయింది.

"నీకు నచ్చిన ఇల్లు, మనకి నచ్చే అద్దెలో దొరికేట్లు లేదు" అన్నాడు రవి నవ్వుతూ.

"నూటడెబ్భై, రెండొందలయినా ఫర్వా లేదు. ఒక్క రూమూ, కిచెనూ ... కొద్దిగా డీసెంట్‌గా ఉంటే చాలు. బాత్, లెట్రిన్, మాత్రం సెపరేట్‌గా ఉండాలి. అవి మాత్రం ఇంకోళ్ళతో షేర్ చేసుకోవడం అసహ్యం నాకు." అంది కస్తూరి.

కానీ ఆ మాత్రం కోరిక కూడా తీరేట్లు కనబడలేదు.

ప్రతిచోటకీ తిరిగి చూడటం సాధ్యం కాదని, కనబడ్డ వాళ్ళందరికీ తమ "కనీస అవసరాలు" తెలిపి, ఇల్లు చూసి పెట్టమని కోరింది కస్తూరి.

అక్కడో ఇల్లుంది. ఇక్కడో పోర్షనుంది అన్న సమాచారం రోజూ వస్తూండేది.

అన్నీ చూసి వచ్చారు.

ఏవీ నచ్చలేదు.

ఒకరోజు బ్యాంక్ కెళ్ళి కొలీగ్స్ అందరితో కూడా చెప్పింది.

వాళ్ళ బ్యాంక్‌లోనే క్లర్క్‌గా పని చేస్తోంది మంగళ. నిదానస్తురాలు. మొహ మాటస్తురాలూను. కస్తూరికి ఆ అమ్మాయంటే ఇష్టం. తను ఏ పని చెప్పినా ఎదురు చెప్పకుండా, వాదించకుండా, నిశ్శబ్దంగా చేసేస్తుంది. ఇంకోరి జోలి పట్టించుకోదు.

అట్టే చొరవ ఉన్న మనిషి కాదనీ, బ్యాంకూ, ఇల్లూ తప్ప ఇతర వ్యాపకాలేవీ పెట్టుకోదనీ తెలిసి కూడా యథాలాపంగా తనని కూడా అడిగింది కస్తూరి.

"మంగళా! ఇల్లొకటి చూసిపెట్టాలి మీరు."

"ఎవరికండీ?"

"నాకే."

"మీకేనా? అయితే మా ఇంట్లో ఒక పోర్షను అద్దెకిచ్చాం. వాళ్ళు రేపు ఫస్టుకి ఖాళీ చేసి వెళ్తారుట. మీరు చేరొచ్చు. రెండు రూములూ, కిచెనూ వరండా రైలు కంపార్టుమెంటులాగా వరసగా ఉంటాయి. ఈ పోర్షనుకి బాత్‌రూం లెట్రిన్ వేరే ఉన్నాయి.

"అద్దె ఎంతో?"

"ఇదివరకు ఉన్నవాళ్ళు నూట ఏభై యిచ్చేవాళ్ళు" అంది మంగళ ఇబ్బందిగా.

'చంకలో బిడ్డనుంచుకుని...' అన్న సామెత గుర్తొచ్చింది కస్తూరికి. అదే చెప్పింది నవ్వుతూ.

ఫస్టుకి వేరేకాపురం పెట్టేశారు. కస్తూరీ రవీ.

* * *

కాపరం పెట్టిన మూడురోజులకే శెలవైపోయింది పొడిగిద్దామంటే కుదరలేదు.

బ్యాంకులో జాయినవ్వాల్సిన రోజు.

పొద్దున్నే లేచి, కాఫీ పెట్టింది. హడావిడిగా వంటచేసింది. రవికి పెట్టి తను తినే సరికి తొమ్మిదిన్నర అయింది.

"మీరలా బజారులోకి వెళ్తారేమిటి?" అంది.

"పద. నేనూ వస్తాను నీతో" అంటూ బయల్దేరాడు రవి. బస్ స్టాప్‌లో ఎంత సేపు నిలబడినా బస్సుదొరకలేదు.

కస్తూరి తొందర పడిపోతోంది.

"స్టాఫ్ అంతా పదిన్నరకు వస్తారు. ఆఫీసర్లం ఓ పావుగంట ముందే, అంటే పదింపావుకల్లా వెళ్ళిపోవాలి. అప్పుడే పదయి పోయింది."

రవి కస్తూరి వైపు కొద్దిగా గర్వంగా చూశాడు.

తన భార్య, ఆఫీసరు. పదిమంది మీద పెత్తనం చెలాయించే అమ్మాయి, తనకి వండిపెట్టి బాంక్ కెళ్తుంది.

"ఆటోలో వెళ్ళి పోతానండీ." అంది.

"ఇద్దరం కలిసే వెళదాం" అంటు ఆటోపిలిచి మాట్లాడాడు.

"టైముంటే సరదాగా కాస్త కాఫీ తాగి వెళ్ళేవాళ్ళం. కుదరలేదు." అని బాధపడింది కస్తూరి.

బ్యాంక్ దగ్గర తనని దింపేసి, అలా బజారులోకి తిరిగ్గా నడుస్తూ, వెళ్ళాడు రవి తృప్తిగా. నిశ్చింతగా ఉంది.

పనిలేదు. దిగులులేదు. బోలెడంత భద్రత రేపెలా గడుస్తుందనే బాధలేదు.

రేపట్నుంచీ మళ్ళీ ట్యూషన్ చెప్పడాని కెళ్ళాలి. కనీసం కాలక్షేపం కోసమైనా.

కనిపించిన ప్రతి వేకెన్సీకీ అప్లికేషన్ పడెయ్యాలి ఇంటర్వ్యూ వస్తే, గిస్తే, ధైర్యంగా వెళ్తాడు తను. ఇదివరకులా వణికి పోతు, నీరుగారిపోతూ ఉండడు.

ఆ ఇంటర్వ్యూచేసే ఆఫీసరు పిచ్చి పిచ్చి ప్రశ్నలు వేసి హడలగొట్టాలని చూసినప్పుడు, "నా పెళ్ళాంకూడా ఆఫీసరేనోయ్" అని బాంబ్ పేల్చినట్లు చెప్పేస్తే!

మెల్లిగా అటూ ఇటూ తిరిగి ఇల్లు చేరుకున్నాడు. ఏం చెయ్యాలో తోచలేదు. కాసేపు పేపరు చదివాడు తర్వాత నిద్ర పోయాడు. లేచేసరికి రెండయింది. కాఫీ తాగాలనిపించింది.

స్టౌ వెలిగించి డికాక్షన్ కాచాడు.

బ్రహ్మచారి జీవితంలో ఇది తనకలవాటే. వంటకూడా చులాగ్గా చేసెయ్యగలవాడు.

సెగలు కక్కుతున్న కాఫీ తయారయింది.



## కస్తూరి

తీరిగ్గా పడకుర్చీలో పడుకుని తాగాడు.

అప్పుడొచ్చింది ఆలోచన.

సాయంత్రం కస్తూరి వచ్చి అడుగుతుంది – కాఫీ తాగారా ? అని.

పెట్టుకుని తాగానంటాడు.

ఎలాగూ పెట్టారుకదా, తనకోసం ఓ గుక్కెడు ఉంచకూడదా అనుకోదూ ?

చటుక్కున లేచి మళ్ళీ స్టౌ అంటించాడు.

విచిత్రంగా ఉంది ఇది.

పాత్రలు తారుమారయ్యాయి.

భార్య నాలుగు రాళ్ళు సంపాదించడానికి బ్యాంక్‌లో ఒళ్ళు వంచుకు పనిచేస్తుంటే, తను ఇంట్లో కూర్చుని కాఫీ పెడుతున్నాడు.

కథల్లో వర్ణించినట్లు కస్తూరి ఇంటికి రాగానే తను కాఫీ కప్పుతో ఎదురెళ్ళి చిరునవ్వుతో స్వాగతం చెప్పాలా ?

నవ్వుకున్నాడు.

ఆరవుతుండగా వచ్చింది కస్తూరి.

తలుపు తట్టగానే మెలకువ వచ్చింది. ఇంతసేపు నిద్రపోయాడు తను !

కస్తూరిని చూసిన సంతోషంలో ఫ్లాస్కులో పోసిఉంచిన కాఫీ సంగతి మర్చిపోయాడు.

మొహం కడుక్కుని మెత్తారంగా టవల్‌తో అద్దుకుంటూ వచ్చిన కస్తూరి, టేబుల్ మీదిదున్న అందుకోబోతూ ఫ్లాస్కు చూసింది.

"కాఫీ తెప్పించుకు తాగారేమిటి ? సారీ! పొద్దున హడావిడిలో డికాక్షన్ పెట్టడం మర్చిపోయాను."

"మరేం ఫర్వాలేదు. కాఫీ పెట్టుకోవడం నా కలవాటే. తాగిచూడు."

"నాకూ ఉంచారా? ఛీ! అదేమిటండీ! నాకలాబావుండదు. మీచేత పనులు చేయించుకోవడం."

"నాకు అలానే బావుంటుంది."

కస్తూరి కాఫీ గ్లాసులో పోసుకునే ప్రయత్నం చెయ్యలేదు, ఊరికే మూత తీసి చూసింది.ఆ చూపులు తర్వాత రవి మీదికి మళ్ళాయి. ఆచూపుల్లో కొద్దిగా కృతజ్ఞత ఇంకొద్దిగా ఆరాధన.

"థాంక్యూ!" అంది.

"ముందు తాగి, రుచి చూసి, ఆ తర్వాత థాంక్స్‌చెప్పు. ఇప్పుడే చెప్పేస్తే ఎలా?"

"ఇంత ప్రేమని మీరు కాఫీలో కలిపిన తర్వాత ఇంక రుచిగా ఉండక పోవడం అన్న ప్రశ్న ఎక్కడ ?"

ఫ్లాస్కు చేతిలో పట్టుకుని, తనకు తెలియకుండానే అతని దగ్గరకు వెళ్ళింది.

"చాలా అదృష్టవంతురాల్ని నేను."

"ఎందుకని?" అని అడిగాడు రవి, ఆమె చెప్పబోయే జవాబు తెలిసి కూడా, సంతోషంగా ఉందతని మనసు. ఎక్కువ ఆలోచించకుండానే చేసిన ఒక చిన్నపని, ఇద్దర్నీ ఇంకా దగ్గరకు తీసుకొచ్చింది.

"మీలాంటి మంచి మనిషిని చేసుకున్నందుకు."

"ఊరికే తీరిగ్గా ఇంట్లో కూర్చోవడం ఏదో నేరంలా ఉంటుంది నాకు. నువ్వు పాపం రోజంతా ఊపిరసలపకుండా పనిచేసి వస్తావు కదా! రేపట్నుంచి ఇలాగే కాఫీచేసి ఉంచుతూ ఉంటాను రాణిగారు వచ్చే టైంకి. లేకపోతే రాత్రివంట కూడా ముగించేసి ఉంచమంటావా ?"

"ఇంకా నయం!" అని అందంగా మూతి తిప్పింది.

"రేపట్నుంచీ ఇలా తప్పు చెయ్యను. వెళ్ళే ముందే డికాక్షన్ కూడా తయారు చేసి పెట్టేస్తాను.

"వద్దొద్దు. ఈ చిన్నచిన్న పనులన్నీ నేనే చేసెయ్యగలను, ఊరికే ఉండి ఏం చేస్తాను గనక, కూరలు తెస్తాను చీరెలూ, జాకెట్లు కూడా ఇస్త్రీ చేయించుకు రమ్మంటే చేయించుకొస్తాను. అలా కాదంటావా. ఎలక్ట్రిక్ ఐరన్ ఒకటి కొనేద్దాం చాకిరేవు పెట్టే బట్టలన్నీ ఉతికి ఇస్త్రీ చేసి పారేస్తుంటాను." అన్నాను రవి సరదాగా.

మాట మార్చింది కస్తూరి.

"సినిమా కెళ్దామండీ ఇవాళ."

"వెళ్దాం. దేనికి ?" అన్నాడు.

"మీ ఇష్టం. ఏదైనా సరే. ఇకనుంచీ మీ ఇష్టమే నా ఇష్టం."

"ఎంటర్ ది డ్రాగన్‌కి వెళదాం."

వెంటనే ఒప్పేసుకుంది కస్తూరి.

"ఇష్టమేనా నీకు ? లేకపోతే ఇంక దేనికన్నా వెళ్దామా ?"

"ఇష్టమే."

"నిజం చెప్పు."

"నిజం చెప్పాలంటే స్టంట్ పిక్చర్స్ నాకు నచ్చవు. అయినా ఇప్పుడు వేరు. మనిద్దరం కలిసి చూస్తే ఏ సినిమా అయినా

వచ్చుతుంది నాకు. సరే. ఓ సంగతి చెప్పండి ఏం చీరె కట్టుకోను ?''

"బావుంది! నాకేం తెలుస్తుంది?"

"నాకున్న చీరెలన్నీ కట్టేసుకున్నాను. మీరు చూశారు. మిగిలింది ఒక్కటే ఉంది. ఈ ముదురాకుపచ్చ గార్డెన్ వాయిల్ చీరె. మీరు చూడలేదు కదూ? కట్టుకోనా? మీ కిష్టమైతేనే.''

"నేను చూస్తే చాలా?"

"అవును. మీరు చూస్తే చాలు. కేవలం మీరు చూస్తే చాలు." అంది పరవశంగా, రెట్టించి చెప్తూ.

"కస్తూరి! చాలా పాత డైలాగొకటి చెప్పనా?"

"ఏమిటది?"

"ఐలవ్‌యూ!"

"సేమ్ విత్‌మీ!" అంది కస్తూరి కొద్దిగా సిగ్గు పడుతూ.

చీరె కట్టుకుని ముస్తాబై "బావుందా?" అని అడిగింది.

"ఇంతకుముందు ఎలా ఉండేదో గానీ నువ్వు కట్టుకున్న తర్వాత చాలా బావుంది. ఏ చీరైనా అంతేనేమో! నువ్వు కట్టుకుంటే అందమొస్తుంది." అన్నాడు రవి.

బయల్దేరి వస్తుండగా "ఇదిగో, మీ దగ్గరే ఉంచండి." అంటూ హాండ్‌బ్యాగ్ లోంచి మెత్తటి కిడ్ లెదర్ పర్సు ఒకటి తీసి అతనికిచ్చింది.

"ఎందుకు?" అంటూ పర్సు తెరిచి చూశాడు.

కొన్ని సరికొత్త వందరూపాయల నోట్లూ, విడిగా చిన్ననోట్లూ కొన్ని ఉన్నాయ్.

"ఇవాళే సేలరీ వచ్చింది. మా బ్యాంక్‌లో అంతే. నెలాఖర్లో, తక్కిన ఆఫీసులకంటే ఒకటి రెండు రోజుల ముందే ఇచ్చేస్తారు. సేలరీ మొత్తం మీకిచ్చేస్తాను. ఇంటి ఖర్చుకీ, నా ఖర్చుకీకూడా మీరే ఇవ్వండి డబ్బులు. నాకు రోజుకి రూపాయి ఇరవై పైసలు చాలు. అరవై పైసలు బస్సుకీ, అరవై పైసలు రెండు సార్లు టీ తాగడానికీ లంచ్ ఎలాగో ఇంటి నించే పట్టుకెళ్తాను కదా'' అంది.

"నాకు చేతకాదు కస్తూరీ. ఇన్ని వంద రూపాయి నోట్లు ఒక్కసారిగా ఎప్పుడు ముట్టుకోలేదు నేను. మేనేజ్ చెయ్యలేనేమో! నీ దగ్గరే ఉంచుకుని నాకే రోజూ ఓ రూపాయి ఇవ్వు. నా ట్యూషన్ల డబ్బు సిగరెట్ల ఖర్చుకే సరిపోదు'' అన్నాడు.

"మానెయ్యకూడదూ పాడు సిగరెట్లు?" రవి నవ్వాడు.

* * *

"ఇవాళ సాయంత్రం మా బ్యాంక్ దగ్గరికి వచ్చేస్తారా? కాసేపు అలా తిరిగొద్దాం." అంది ఒకరోజు.

"మహాభాగ్యం! ఏమీ తోచక చచ్చిపోతున్నాను. రోజూ నీ బాడీగార్డులా నిన్ను బ్యాంక్ దగ్గర దింపి, మళ్ళీ బ్యాంక్ మూసే టైంకి వచ్చి నిన్ను ఇంటికి తీసుకు రమ్మన్నా నా కిష్టమే.''

"మీరు చాలా చాలా మంచివారు" అంది కస్తూరి.

కస్తూరి రోజూ తొమ్మిదింటికల్లా భోజనానికి కూర్చునేది. రవికి ఒంటి గంటకు ముందు తినడం ఇదివరకెప్పుడూ అలవాటు లేదు.

"నువ్వు తినేసి వెళ్ళిపో. నేను ఆలస్యంగా తింటాలే." అనేవాడు మొదట్లో.

"ఛీ! మీ అంతట మీరే వడ్డించుకు తింటారా? నేను లేనూ?"

"ఈ టైంకి ఆకలెయ్యదు కస్తూరీ!"

"మనిద్దరం కలిసి భోంచేస్తేనే నాకు బాగుంటుందండీ" అంది అసలు సంగతి బయట పెడుతూ.

సాయంత్రం నాలుగు గంటలకు లేచి షేవ్ చేసుకున్నాడు. అందరూ అయితే టైం ప్రకారం పనులు చేసుకోవాలి. తనకి అలా కాదు. ఇష్టమొచ్చినంత స్వేచ్ఛ ఏం చెయ్యాలో తెలియనంత తీరిక.

## రకరకాల ఆవకాయలు

### పనసావకాయ

మధ్యప్రదేశ్‌లో కూరపనసను ఆవకాయ కూడా పెడతారు. మాకు తెలిసినవారు పంపగా రుచిచూచి మేముకూడా పెట్టాము. బాగానే కుదిరింది. క్రొత్త రుచులు కావాలనుకునేవారు ప్రయత్నించి చూడండి.

కావలసిన సామాగ్రి :– ½ కే. కూర పనసకాయ, అర్ధపావు ఆవపిండి, అర్ధపావు పచ్చికారం, 1 పావు ఉప్పు, 2 పుల్లని మామిడికాయలకోరు, 1 పావు మంచినూనె, 1 టేబిల్ స్పూన్ పసుపు.

పనసకాయతెచ్చి చెక్కుతీసి గింజలతో హా ముక్కలు తరగండి, పొయ్యిమీద అర్ధ తో నీళ్ళు ఎసరుపెట్టి కళపెళ మరుగుకున్నప్పుడు, పనసకాయ ముక్కలు వేసి ఐదు మిషములు వుడికించి వార్చేయాలి. వార్చిన ుక్కలు విడిగా ప్లేటులో సర్ది సాయంత్రం రకూ ఎండబెట్టి, కారం, పసుపు, ఉప్పు, నె అన్నీవేసి కలిపి జాడీలో పెట్టి, మూడవ రోజునుండి భోజనములో వాడుకొనవచ్చును. ఈ ఆవకాయ ఎక్కువ రోజులు నిలవ వుండదు.

### పండుమిరపపళ్ళ ఆవకాయ

½ కే. ఎఱ్ఱగా పండిన మిరపపళ్ళు, 1 పావు ఆవపిండి, 1 పావు ఉప్పు, 1 టేబిల్ స్పూన్ ధనియాలపొడి, 1 టేబిల్ స్పూన్ జీలకర్రపొడి, 2 టీస్పూన్లు పసుపు, 1 పావు మంచినూనె, 1 పావు మామిడి ఒరుగులపొడి.

చేయు విధానము :– మిరపపళ్ళు పెరుగు మిరపకాయల్లా చీల్చుకుని, పైన చెప్పిన మషాలాలు. మంచినూనె కలుపుకుని కాయల్లో కూరి పెట్టాలి. మిగిలిన పొడిని జాడీ అడుగు కొంత వేసి మిరపకాయలు పేర్చి పెట్టండి. అన్నీ పేర్చిన తరువాత మిగిలిన భాగాన్ని పైనవేసి మూతపెట్టి గుడ్డ వాసెనకట్టి మూడవరోజున క్రింది కాయలు మీదా-మీద కాయలు క్రింద సర్దాలి. ఇదికూడా మూడవ రోజునుండి తినవచ్చును. ఈ ఆవకాయ ఏటి కేడాదిపాటు నిలువ వుంచుకుని మధ్యప్రదేశ్‌లో తింటూ వుంటారు. క్రొత్తరకం ఆవకాయలు చేయాలన్న సరదా వున్నవారు దీనిని హాయిగా చేయవచ్చును. చెడిపోకుండా నిలువవుంటుంది.

### పచ్చిమిరపకాయలతో ఆవకాయ

1 పావుకిలో పచ్చిమిర్చి, అర్ధపావు ఆవపిండి, టీస్పూన్ పసుపు, 6 బాగా రసమున్న నిమ్మకాయలు, తగినంత ఉప్పు.

చేయు విధానము :– మిరపకాయలు లావుగా పొడవుగావున్నవి ఎంచుకోవాలి, వాటిని పైనుండి క్రిందివరకూ బ్లేడుతో చీల్చిపెట్టండి. ఉప్పు, ఆవపిండి, పసుపు కలుపుకుని 3 నిమ్మకాయల రసంతో ముద్దచేసి పచ్చిమిర్చిల్లో కూరండి. అన్నీ జాడీలోకి పెట్టుకుని పైన మరొక 3 నిమ్మకాయల రసం పోయండి.

—ఎం. వి. రమణమ్మ.

అందరూ ఆఫీసులకెళ్ళే టైముకి తను కాలక్షేపానికి రోడ్డుమీది కెళ్ళాడు. అందరూ డస్సిపోయి ఆఫీసుల్నుంచీ తిరుగు ముఖం పట్టే వేళకి తను మొహం కడుక్కొని పూల రంగళ్ళా ఇస్త్రీ బట్టలేసుకొని షికారు కెళ్ళాడు.

బాగుంది. బాగుంది.

బ్యాంక్ దగ్గర బస్‌స్టాప్‌లో నిల్చున్నాడు. ఆరవుతుండగా వచ్చింది కస్తూరి.

"మీరు వచ్చి చాలా సేపయిందా ?"

"ఇప్పుడే వచ్చాను."

పక్కనే ఉన్న హోటల్లో కాఫీ, టిఫినూ ముగించారు. కొద్దిగా అలిసిఉన్న కస్తూరి మొహం ఇంకా అందంగా కనబడింది రవికి.

"ఏమిటి ప్రోగ్రాం ? చెప్పనే లేదు." అన్నాడు.

**వంటలు**

ఈ శీర్షికకు కొత్తరకం వంటలు క్లుప్తంగారాసి పంపాలి. కొలతలు అన్నీ ఏదో ఒక కొలమానంలోనే వుండాలికాని వేర్వేరు పద్ధతులు వాడవద్దని మనవి.

[ సం. ]

# కస్తూరి

"ఏం లేదు. యూనియన్ బ్యాంక్‌లో నాకు సేవింగ్స్ అకౌంట్ ఉంది. అది మీ పేరుతో మార్చేద్దాం..'

"అలా ఎందుకు ? ఒద్దొద్దు." అన్నాడు రవి గట్టిగా.

"పెళ్ళి గాకముందు నా పేరుతో ఉంటే బాగానే ఉండింది. ఇప్పుడింక అన్నీ మీ పేరుతోనే ఉండాలి. లేకపోతే నాకు మొహమాటంగా ఉంటుంది. సరేనా ?"

కాసేపు ఆగి అన్నాడు రవి.

"ఒద్దు కస్తూరీ ! నీ పేరుతోనే ఉండయ్."

"నా కలా ఇష్టం లేదు."

ఇంకాసేపు ఆలోచించాడు.

"పోనీ జాయింట్ అకౌంట్ ఓపెన్ చేద్దాం. నీకొచ్చే వందలూ, నాకొచ్చే పదులూ, పాతికలూ, అందులో వేసుకో వచ్చు" అన్నాడు.

"వద్దండీ. అంతా మీ పేరుతోనే ఉంటే బాగుంటుంది."

"దీనికంతా అర్థం ఏమిటి ?" ఇష్టంగా చూస్తూ అడిగాడు.

"మీరు చెప్పారే, ఓల్డ్ డైలాగని. అదే."

"అంటే..."

"అంటే ... ఐలవ్‌యూ !" మెల్లిగా అంది. "ఐటూ"అన్నాడు రవి సంతోషంగా.

* * *

మంగళ లీవ్ లెటర్ తెచ్చి టేబుల్ మీద పెట్టింది.

"ఏమిటి ?" అంది కస్తూరి తలెత్తి చూసి, చిరునవ్వుతో.

"బుధవారం నాడు పండగ అవుతుంది. సోమ, మంగళవారాలు నేను బ్యాంక్‌కి రాలేను. లీవు కావాలి. మా నాన్నగారు వాళ్ళు పండక్కి రమ్మంటున్నారు." అంది.

"ఓ. కె." అంటూ లీవ్‌లెటర్ మీద ఇన్షియల్ వేసి ట్రేలో పడేసింది.

రేపు ఆదివారం.

ప్రతి ఆదివారం ఇంటికెళ్ళి అమ్మనీ, నాన్నగారినీ చూసి రావడం తమ ఇద్దరికి అలవాటు.

ఎక్కడికైనా అంతే. ఇద్దరూ కలిసే వెళ్ళాలి. కూరలకెళ్ళినా, సినిమాకెళ్ళినా కూడా.

ఈ ఆదివారమన్నా నాన్నగారు వస్తారేమో, అల్లుణ్ణి పండక్కి పిలవడానికి.

ఆయన వస్తారు రావాలి అన్న ఉద్దేశ్యంతోనే కిందటి వారంకూడా తను పుట్టింటి కెళ్ళలేదు.

అక్కడికెళ్ళిన తర్వాత పండక్కి రమ్మని పిలిస్తే ఆయనకి మర్యాదగా ఉండదు.

ఇంటికొచ్చి అల్లుణ్ణి ఆహ్వానించాలి వాళ్ళు.

నాన్నగారే వచ్చి పిలవాలి. లేకపోతే అన్నయ్య వచ్చి పిలవాలి.

వాళ్ళకోసం ఎదురుచూస్తూ గడిపేసింది ఆదివారం.

ఎవరూ రాలేదు

"ఎందుకు అలా ఉన్నావ్ ?" అని చాలా సార్లు అడిగాడు రవి.

"ఏంలేదు" అని చెప్పిందిగానీ, ఎందుకు లేదు ?

గుండెల్లో ఏదో మూలసన్నగా పుట్టింటి వాళ్ళమీద కోపం, కొద్దిగా చిన్నతనం.

వాళ్ళమీది కోపం మొగుడి మీది ప్రేమను ఎక్కువ చేసింది.

ఎందుకు రాలేదు వాళ్ళు ?

ఉద్యోగం లేని అల్లుడని చులకనా ?

భార్యకంటే తక్కువ చదివాడని అలుసా? ఎందుకు?

సోమవారం పొద్దున లేచినప్పట్నుంచి మళ్ళీ ఎదురు తెన్నులు చూడ్డం మొదలెట్టింది.

బ్యాంక్‌కి వెళ్ళాలనిపించలేదు. ఓ షాపు నుంచి బ్యాంక్‌కి ఫోన్‌చేసి తను జ్వరంవల్ల రాలేకపోతున్నాననీ, లీవు కావాలనీ చెప్పింది.

నిదానంగా వంట ప్రయత్నం మొదలెట్టింది.

తలుపు చప్పుడయి నప్పుడల్లా నాన్నగారే అనిపించేది.

అడుగులు వినపడినప్పుడల్లా మనసులో కొంత ఆశ మెదిలేది.

ఓ సారి గేటు చప్పుడయితే బయటికెళ్ళి చూసింది. పేపరబ్బాయి.

ఇంకోసారి పని మనిషి.

ఇంకోసారి పక్కింటి పిల్లలు. బాల్ పడి పోయిందని తీసుకోవడానికి కొచ్చారు.

అసహనంగా ఉన్నకస్తూరి ఆ పిల్లల మీద విసుక్కుని. వాళ్ళు మొహం గంటు పెట్టుకుంటే మళ్ళీ బాధ పడింది.

"ఏమిటి కస్తూరీ? ఎందుకు విసుగ్గా ఉన్నావ్?" అన్నాడు రవి నెమ్మదిగా,లాలనగా.

"ఏం లేదండీ. "అంది.

రవి వదల లేదు. పదిసార్లు అడిగాడు. ఆమె ముభావంగా ఉంటే అతనికి తోచటం లేదు.

చివరికి బయట పడిపోయింది కస్తూరి.

"వీళ్ళ పద్ధతి చూడండి పెళ్ళయిన తర్వాత మొదటి పండగ కదా? అల్లుణ్ణీ, కూతుర్నీ ఇంటికి పిలుచుకొచ్చు కోవాలన్న మర్యాద కూడా తెలియదు."

రవి మనసు తేలికయింది.

"ఓస్! ఇందుకేనా! వేనుకదా నవ్వించు కుని బాధపడాల్సింది. నామర్యాద కేంతక్కువ కాలేదు."

"మీరు మంచి వారుగనుక పట్టించు కోరు మిమ్మల్ని అమర్యాద చేస్తే నాకు బాధకాదా? ఛీ! ఏం మనుషులో;"

"డబ్బా అదీచూచుకో వద్దా! వాళ్ళ ఇబ్బందులు వాళ్ళవి."

కస్తూరి మాట్లాడలేదు. ఇంకా కోపంగానేఉంది.

సాయంత్రం వచ్చారు జానకి రామయ్య గారు.

ముభావంగానే పలకరించింది కస్తూరి.

"పదిరోజుల్నుంచి వంట్లో బాగుండట్లేదమ్మా. అన్నయ్యేమో క్యాంప్ కెళ్ళాడు. ఏరోజు కారోజు వద్దామనుకుంటూనే గడిచి పోయింది. మీఆయనేడీ?"

"నమస్కారమండీ." అంటూ బయటి కొచ్చాడు రవి

"ఏమయ్యా రవీ! కులాసానా? పండక్కి అమ్మాయిని తీసుకొని వచ్చి నాల్రోజులి పాటు మాదగ్గరే ఉండాలి. వీలయితే ఇప్పుడే వచ్చెయ్యండి. వెళ్ళి పోదాం." అన్నారు.

కస్తూరి తేలిగ్గా నిట్టూర్చింది. రవి ఏమాత్రం బాధపడినట్లు కనబడక పోవడంతో అతనిమీద గౌరవం ఎక్కువైంది. మర్నాడు పుట్టింట్లో సరదగా గడిచి పోయింది, పండగరోజు మధ్యాహ్నం.

ఆలస్యంగా భోజనాలు చేసి కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారు.

రవికి ఈ మధ్య పగటి నిద్ర బాగా అలవాటైంది. అతను బయట గదిలో




పడుకుని నిద్రపోతున్నాడు. సాయంత్రం సినిమా కెళ్ళాలని తమ్ముడూ, చెల్లెలూ ప్రపోజ్ చేస్తే సరేనంది కస్తూరి.

"నీ చీర ఏదన్నా ఇవ్వు అక్కయ్య! ఇవాళ సరదాగా కట్టుకుంటాను." అంది అరుణ. ఆ అమ్మాయి టెన్త్ క్లాస్ చదువుతోంది. ఇంకా పరికిణీ ఓణీల్లోనే ఉంది.

సూట్‌కేస్ తీసింది కస్తూరి. తనకు నచ్చిన నైలెక్స్ చీరె ఒకటి తీసుకుంది అరుణ. ఇంకో ఎర్రరంగు చీరె బయటకు తీసి ఆశ్చర్యంగా చూస్తూ అడిగింది. "ఇది నీ చీరేనా అక్కయ్యా! ఎర్రరంగు నీకిష్టం లేదుగా" అంది.

"బావ కొనిచ్చారు" అంది కస్తూరి.

అరుణ నవ్వింది.

"బావ కొనిస్తే ఏర్ర చీరె అయినా ఇష్టమేనన్నమాట. తనే వెళ్ళి కొన్నాడేమిటి? దీనికి చెమ్కీ ఏమిటి? మొగాళ్ల సెలెక్షను వద్దు బాబోయ్" అంటూ విరగబడి నవ్వింది.

కస్తూరికి రోష మొచ్చింది.

ఎర్రరంగో, నల్లరంగో, ఆయన కొనిచ్చారు. అందుకే తనకిది ప్రాణప్రదం. అన్నిటోకి చాలా ఇష్టమైన చీరె ఇదే.

ఆ చీరెను పట్టి పట్టి చూశారు అందరూ. చూసి నవ్వారు.

వాళ్ల నవ్వులు రవి వింటాడేమోనని భయపడింది కస్తూరి.

"ఈ చీరె నాకు చాలా ఇష్టం. ఇదే ఇవాళ సినిమాకు కట్టుకొస్తాను" అంది ఖచ్చితంగా.

తనకి కోపం వచ్చిందన్న సంగతి గ్రహించి ఇంకెవ్వరూ ఆ ప్రస్తావన తేలేదు.

వాళ్ళు సరదాగా, మామూలుగా అనేసినా తన భర్తను గురించి తక్కువగా అనుకుంటారేమోనన్న భయం.

ఆయన వినలేదు కదా!

నాలుగవుతుండగా, ఆ ఎర్రచీరకట్టుకుని కాఫీ తీసుకుని, రవిని లేవడానికి వెళ్ళింది.

అతనింకా నిద్రపోతూనే ఉన్నాడు.

లేపింది.

"మొద్దు నిద్ర పోయాను కదూ" అంటూ ఒళ్లు విరుచుకున్నాడు.

అంటే వాళ్ల నవ్వులు వినలేదు. నయమే "మీరుకొన్న చీరె. బావుందా?" అంది.

"బావున్నావు" అన్నాడు రవి సమాధానంగా.

రెండ్రోజులు అక్కడ గడిపి యింటికొచ్చేశారు. ఆ రాత్రి అతని కౌగిట్లో గువ్వలా ఒదిగి పడుకున్న కస్తూరి మనసులోనే తనని తను అభినందించుకుంది.

ఫర్వాలేదు తను తొందరపడలేదు. బాగా ఆలోచించి ఈ పెళ్ళి చేసుకుంది. అతను తనకంటే తక్కువే చదివినా, ఉద్యోగం లేక పోయినా తమ మధ్య పొరపొచ్చాలేం రావటం లేదు సుఖంగా, ప్రేమగా ఉండగలుగుతున్నారు, అనుకున్నది సాధించగలిగింది తను అనుకుంది...

[ శ్రీవారం చివరిభాగం : రచన : వేదగిరి రాంబాబు ]

సీ రి య ల్

# తమసోమా జ్యోతిర్గమయ



ఎం.పి.ఆర్. రాధాకృష్ణ

*(గత సంచిక తరువాయి)*

సుజాత దిండులో ముఖం దాచుకొని వెక్కి వెక్కి ఏడుస్తూంటే ... రజని అనునయంగా ఆమె తలమీద చేయివేసి నిమిరింది.

"ఛ... ఇంతమాత్రానికే ఏడుపా! రోడ్డుమీద వెళ్తుంటే ఎన్నో కుక్కలు మొరుగుతాయి. 'వీడొక కుక్క' ... అనుకుంటే సరిపోయింది. అయినా వాడంత లోఫర్‌గాడని నేనూ అనుకోలేదు. ఎంత ధైర్యం వెధవకి. జరిగినదేదో జరిగింది. నువ్వు గట్టి డోస్ యిచ్చావుగా! కుక్క కాటుకు చెప్పుదెబ్బ! ఏడవకు. వాడి మాటలకు బాధపడ్డంకూడా మనకే చిన్నతనం..." అంది ఓదార్పుగా!

సుజాతలేచి కళ్ళు తుడుచుకుంది. "అది కాదురజనీ! వాడేమన్నాడో నూడు. నేను పెళ్ళి వద్దన్నది వాడికోసమేనట. పైగా.. నేను బజారు ఆడదాన్నట..."

మళ్ళీ కళ్ళనిండా నీరు నిండాయి శేఖర్... అన్నమాటలు తలచుకుంటూంటే హృదయం భగ్నమవుతున్నాది...

"అదిగో.. మళ్ళీ! ఇదిగో యిటుచూడు. మంచివాడు కానిమాటంటే బాధపడాలి. దుర్మార్గుడు నోరుజారి మంచిమాట అంటే ఆశ్చర్యపోవాలి. శేఖర్‌వంటి వెధవలు వాళ్ళకు తగినట్లే ఆలోచిస్తారు, మాట్లాడతారు. దానికేయింత బాధపడాలా! చూడు. కళ్ళలా ఉబ్బిపోయినయ్యో! వెళ్ళి ముఖం కడుక్కో. అవన్నీ మర్చిపోవాలి. ఈలోకమంటే ఏమిటనుకున్నావు! ఇదొక అడవి. అడవిలో పనికివచ్చే చెట్లు తక్కువే ఉంటాయి. మనకున్న ఆశయాలు ఈ లోకానికి అనవసరం. అదెప్పుడూ ఒకే కోణంనుండి చూసి, ఆలోచిస్తుంది. నువ్వు బాధపడ్డంవలన కంటినీరు ఖర్చేగాని. కించిత్ లాభం ఉండదు, ఎద్దు ఈనిందంటే దూడను కట్టెయ్యడమే సిద్ధాంతం అంతేగాని. 'అదెలా' అని ఆలోచించరు చాలామంది, ఎందుకో తెలుసా! అందరికీ ఏవో సమస్యలుంటాయి. అవికొరివిదయ్యాల్లా అనుక్షణం భయపెడుతూనే ఉంటాయి. వాటినుండి విముక్తి ఉండదు. అందుకని. ఎదుటివారి కష్టాల్ని చూసి ఆనందం అంతే! ఒకవేళ నువ్వు బాధ పడితీరాలని అనుకుంటే నేను వద్దనను.కానీ నీ బాధ వాడేదో అన్నాడని వద్దు. మన అరుణ గురించి బాధపడు" రజని అనునయంగా అంది.

రజని మాటలతో. సుజాతమనసు తేలికపడినట్లయింది!

బాత్‌రూమ్‌కి వెళ్ళి ముఖం కడుక్కొని వచ్చి పైపైన చిన్నగా ముస్తాబైంది సుజాత!

"మళ్ళీ ఏడవనంటే ఓ మాటనాలనుందే" అంది రజని.

"ఏడవనులే"

"వాడన్నాడనికాదు గాని ఆడదాన్నయినా నిన్ను ప్రేమించాలనిపిస్తున్నాది సుమా!"

"అభ్యంతరమేముంది కానీ" సుజాత నవ్వింది.

"అబ్బ. మళ్ళీ నీ ముహంలో నవ్వు చూశాను, ఐ లైకిట్! జీవితం దేనికి? నవ్వుకోవడానికి. అంతే! సమస్యలు వస్తాయి. కష్టాలు వస్తాయి. త్రో దెమ్ అవుట్ బే ఆఫ్ బెంగాల్లో పారెయ్యి! ఒక ఆశయానికి కట్టుపడి ధైర్యంగా పెళ్ళి చేసుకోను పొమ్మన్నావ్! ఆ ధైర్యాన్నే కడవరకూ నిలబెట్టుకోవాలి. ఆశయాలుంటేనే చిక్కులు ఎదురౌతాయి. ఏ ఆశయము లేకుండా ఏ ఎండకా గొడుగు పట్టేవాడికి చిక్కులేమిటి?"

"బాగానే ఉంది నీ సిద్ధాంతం."

"ఇది నా సిద్ధాంతం కాదమ్మా! జీవితానిది. అద్దంలో చూసుకుంటే నీ ప్రతిబింబమే కనిపిస్తుంది. నీ మనసునే అద్దంచేసి ఈ సమాజాన్ని చూడు. మాయ అద్దంలో రాక్షసుడు కనిపించినట్టు సమాజంలోని కుళ్ళంతా కళ్ళకు కడుతుంది. నేర్చుకోవలసింది నేర్చుకొని మిగిలింది గాలికి విడిచిపెట్టే సెయ్! దెర్ ఎండ్స్ ద మేటర్"

సుజాత రజనివైపు ఆశ్చర్యంగా చూసింది. "చూడ్డానికి అల్లరి పిల్లవే! ఎక్కడ నేర్చావీ మాటలన్నీ."

"తావీజు మహిమ" రజని బింకంగా అంది.

"తావీజేమిటి?" నిజంగానే అర్థంకాలేదు సుజాతకు!

రజని నవ్వింది. "మనుచరిత్ర చదవలేదూ! ఆ ప్రవరాఖ్యుడిలా నేనూ వెళ్ళాను హిమాలయాలకు. అక్కడో సిద్ధుడు కనిపించి తావీజు యిచ్చాడు. ఇదంతా దాని మహిమ."

"కబుర్లు బాగానే చెప్తావ్"

"మనకున్న క్వాలిఫికేషనే అది."

మాటల్లో రజని వదినగారు వచ్చింది. పాపను ఎత్తుకొని!

సుజాత పలకరించింది "మా పాప మీ గురించే అడుగుతున్నాది. ఈమధ్య బొత్తిగా రావడం మానేశారు" అందామెని!

సుజాత పాపను అందుకొని "నిజమేనా పాపా!" అంటూ అడిగింది.

"ఇంకా నెల పూర్తిగా నిండలేదు దానికి! అది మాట్లాడ్డం ఈవిడగారేమో నీతో చెప్పడం — సరిపోయిందమ్మా" రజని పరిహాసంగా అంది!

"మా పిల్ల నీలా వాగుడు కాయ కాదు" అంది వదినగారు.

"మంచిపాప! చాలా ముద్దుగా ఉంది" అంటూ ముద్దు పెట్టుకుంది సుజాత పాపను.

**జరిగినకథ 4** చలపతిరావు, కామాక్షమ్మలకు సుజాత ఒక్కతే కూతురు. సుజాత పెద్దన్న రామం ఉద్యోగంలేక, చిన్నన్న మురళి నాటకాల పిచ్చితోను తిరుగుతుంటారు సుజాత, అరుణ, రజని క్లాస్‌మేట్స్. అరుణ టెన్నిస్ ఆడే శేఖర్‌ని ప్రేమిస్తుంది. తన పెళ్ళికి కట్నంకోసం ఇల్లమ్మాలనుకోవటంతో అసలు పెళ్ళే చేసుకోనంటుంది సుజాత. పరధ్యానంగా నడుస్తూ బస్సు కింద పడబోతున్న సుజాతని రక్షిస్తాడు విక్టర్. మిమ్మల్ని అరుణని ప్రేమించినంతకంటె గాఢంగా ప్రేమిస్తున్నాను మీకోసం ఏదైనా చేస్తానన్న శేఖర్‌ని చీవాట్లేస్తుంది సుజాత.

VOLTAS

# జొలోన్®

**కీటకసంహారి/తవిటపురుగులనాశని**

## మీ ప్రత్తి పంట పెరుగుదలలో ప్రతి దశయందు ఈ క్రింద చూపబడిన హానికరమైన కీటకములనుండి రక్షణనిస్తుంది.



ఆకుముడత, ఆకు ఎండు మరియు పొలుసు పురుగు

మచ్చల పురుగు, హీలియోథిస్, గులాబి పురుగు, దాసరి పురుగు, పొలుసు పురుగు మరియు ముక్కు పురుగు.

మచ్చల పురుగు, గులాబి పురుగు, హీలియోథిస్, ఆకుచుట్టు పురుగు, దాశరి పురుగు, మరియు ఇతర ఆకుతిను గొంగళి పురుగులు, ఎర్ర నల్లి, బూడిద నల్లి, ముక్కు పురుగు, పొలుసు పురుగు, ఆకు ముడత మరియు తవిటి పురుగు.

జొలోన్ ప్రత్తి పంటను రసం పీల్చే, ఆకునుతినే మరియు ప్రత్తి కాయలను నాశనముచేసే హానికరమైన కీటకముల నుండి శక్తివంతముగా రక్షణ నిస్తుంది.

జొలోన్ చాల కాలము నిలిచి పని చేయుట వలన మరియు తెగుళ్లను శక్తివంతముగా అరికట్టుట వలన పొదుపు చేకూరుస్తుంది.

జొలోన్ వివిధ క్రిమికీటకాల సహజ శత్రువులకు హానిచేయదు మరియు తేనెటీగలకు నిరపాయమైనది.

జొలోన్ 35% ఇసి మరియు 4% పొడి రూపములలో లభిస్తోంది.

మీ అవసరములకు మీ జొలోన్ డీలరును కలుసుకోండి.

®జొలోన్ రోన్-పౌలెంక్ ఫ్యాక్టరీ (ఫ్రాన్స్) వారి రిజిష్టర్డ్ ట్రేడ్ మార్కు.




VT 2185



వోల్టాస్ లిమిటెడ్ అగ్రో-ఇండస్ట్రియల్ ప్రొడక్ట్స్ డివిజన్
87/డి, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్-500 003 (ఆం.ప్ర)

జొలోన్‌ను జల్లండి — క్రిమికీటకాల నుండి రక్షించండి.

"అలా గట్టిగా అనకు తల్లీ. నువ్వెళ్ళి పోయాక వో కేజి ఎండుమిరపకాయలు దిష్టి తీసి, పొయిలో పడేస్తుంది, మా వదిన. ఆ పైన ఊపిరాడక చచ్చేంత పనౌతుంది, మాకు!" అంది రజని!

ఆమె నవ్వింది ... "అందరి మాటలు దిష్టి కావు. మనసులో ఈర్ష్యతో, ముఖం ముందు మెచ్చుకుంటే అది దిష్టి. సుజాత మనసు చాలా మంచిది" అంది.

"ఇంకేం మా వదిన నీకు తైరు కొట్టేస్తున్నాది. కాచుకో" అంది రజని నవ్వి!

ఇంతలో శివరావుగారు వచ్చారు ... "మీరంతా ఈ గదిలో కూర్చున్నారా ? మీ కోసం ముందు గదిలో చూశాను" అన్నారు వస్తూనే!

"నమస్కారమండి" అంది సుజాత లేచి నిలబడి.

"వోహో ... నువ్వా! కూర్చోమ్మా. నిలబడ్డం దేనికి" అంటూ ఆయన కూడా

# తమసోమా జ్యోతిర్గమయ

సోఫాలో కూర్చొని "నాన్నగారు బాగున్నారా!" అని అడిగారు.

సుజాత తల ఊపింది.

"నిరంజన్ యింకా కొట్టు నుండి రాలేదు కదూ!" అని ఆయన కోడలినడిగితే ఆమె రాలేదన్నట్లు తలాడించింది.

"బాబ్జి వస్తానన్నాడు వచ్చాడా ?"

"లేదు" అని "బాబ్జి దేనికి నాన్నగారూ ?" అని అడిగింది రజని!

"మన కొత్త బ్రాంచి కోసం కాస నమ్మకమైన కుర్రాడిని చూసి పెట్టమని అడిగాను. మెయిన్ షాపు, బ్రాంచి రెండూ నిరంజన్ ఒక్కడే చూసుకోలేడు కదా!" అన్నారాయన.

సుజాత మనసులో ఏదో మెదిలింది. మాట్లాడాలన్న ఉద్దేశంతో కొంచెం ముందుకు వంగి అంతలోనే మళ్ళీ వెనక్కి తగ్గింది,

రజని సుజాతను గమనించి, గమనించనట్లు ఊరుకుంది.

"ఇప్పట్లో వీళ్ళిద్దరూ వచ్చేలా లేరు బాబ్జి వస్తే వచ్చి చెప్పండి. నేను కాస్సేపు నిద్రపోతాను" అని లేచి వెళ్ళిపోయారాయన.

"నేనూ వెళ్తానే" అని సుజాత కూడా లేవబోతే, రజని చేయిపట్టి ఆపింది.

"అలా పారిపోకు. అయినా బయట ఎండ మండిపోతూంటే ఇప్పుడేం వెళ్తావు కూర్చో! ఎండతగ్గాక వెళ్ళిపోదువుగాని.." అంది!

"అదికాదే..."

"ఏదికాదే..." రజనివెటకారంగా అంది. "నువ్వెందుకు ఉండాయించాలని చూసున్నావో నాకు తెలుసుగాని, మాట్లాడకుండా కూర్చో! మరీ యింత పిరికితనమైతే ఎలా?"

"ఎవరికి. ధైర్యం జారిపోస్తున్నావ్..." అంటూ విక్టర్ రానేవచ్చేశాడు.

"అదిలేనివాళ్ళకు." అని. "చెప్పాపెట్టకుండా ఆడపిల్లలగదిలోనికి రావడానికి నీకెన్ని గుండెలు." అంది రజని!

"నువ్వు ఆడపిల్లవా? అదెప్పటినుండి..." అని, సుజాతవైపుచూసి. "బాగున్నారా?" అంటూ పలకరించాడు.

"ఆ విషయంనువ్వుచెప్పాలి.. 'అనిచిన్నగా నవ్వి "నీకోసం చూసి చూసి నాన్నగారు యిప్పుడే నిద్రపోయారు. నువ్వురాగానే తనను లేపమన్నారు.." అంటూ తండిని లేపేందుకని లేచింది, రజని!

"ఇప్పుడే నిద్రపోతే లేపొద్దు. నాకు వేరె పనేంలేదు. ఆయన నిద్రనుండి లేచేవరకూ కూర్చుంటానులే." అన్నాడు, విక్టర్!

రజని గుంభనంగా నవ్వి... "కూర్చోక. ఇంకెక్కడికి పోతావ్!" అంది చిన్నగా!

ఇంతలో దుఖాణం నుండి కుర్రాడు వచ్చాడు. "బాబూగారు ఈపూటకు రారమ్మ కేరియర్ సర్దిస్తే. తీసుకుపోతాను" అన్నాడు.

పాపను ఎత్తుకొని. రజనివదినగారు. కేరియర్ సర్దడానికి వెళ్ళిపోయింది.

"అతిథి దేవుణ్ణి వచ్చాను. భోజనం పెట్టకపోతే పోయె కనీసం కాఫీ అయినా యిస్తావా?" అన్నాడు, విక్టర్. రజనితో!

"నన్ను పొమ్మంటె పోతానుగా. నిష్ఠూరం దేనికి ?" అని లేచి.

"ఇప్పుడే వచ్చేస్తానులే. కూర్చో." అని.



# ఉన్నత శ్రేణి...






ఉషా టేబుల్ ఫేన్‌లలో అధునాతన డిజైన్ పొందుపరిచారు—సరయిన ఆకారంగల గార్డ్‌లు, ఖచ్చితమయిన పద్ధతిలో అమర్చిన బ్లేడ్లు, అందమయిన పియానోరకం బటన్‌లు అన్ని అంచులకు కూడా చక్కగా అంటిన సమతలమయిన పెయింటింగ్. ఉషా టేబుల్ ఫేన్‌లు చక్కటివి. ఎటువంటి అలంకరణలోనయినా ఇమిడి పోతాయి. ఆకర్షణీయమయిన అనేక రంగులలో లభిస్తాయి. ఇంత ప్రత్యేకతలు ఉన్నప్పటికీ నాణ్యత కంట్రోలుకు సంబంధించి క్షుణ్ణంగా పరీక్షలు జరిగిన తరువాతనే ఈ పంకాలు మీకు అందుతాయి.

మీ ఉషా పంకాలు అతి చక్కటివి—తయారీలోను, పనిచేయడంలో, రంగుల్లోను.

## ఉషా
## టేబుల్ ఫేన్

JEW-347 TEL

సుజాతవైపు చూసి, నవ్వి లోనికి వెళ్ళి పోయింది రజని!

ఇద్దరూ మిగిలారు.

అతని ఎదురుగా కూర్చోవడమంటే ఆమెకు ఊపిరాడనట్లుంది. ఆమె పరిస్థితిని అర్థం చేసుకున్నట్లు పల్చగా నవ్వాడు విక్టర్!

"మీకు ఇబ్బందిగా ఉందనుకుంటాను" అన్నాడు.

సుజాత తడబడి "అబ్బే... లేదండి..." అంది!

ఏమైతే అయిందన్నట్లు విక్టర్ ఆమె వైపు నుండి, చూపు మరల్చలేదు. ఆమె మాత్రం చూపులు నేలమీద నిలబెట్టి ఒద్దికగా కూర్చుంది.

"నేను బయట వెళ్ళి కూర్చుంటాను! కాదన్నా మీ ఇబ్బంది నా కర్థ మౌతున్నది" అన్నాడు విక్టర్ ... లేచే ప్రయత్నం చేయకుండా నే!

సుజాత చటుక్కున తలెత్తి చూసింది. అంతలోనే కలిసిన చూపులను బలవంతంగా విడదీసి "అలా ఎందు కనుకుంటున్నారు?!" అంది!

"ఇద్దరు వ్యక్తులు ఒకదగ్గర కలిసి ఉంటే ఏవో మాటలు పుడతాయి. వాళ్ళు మరీ మాటలు కూడా లేని శత్రువులైతే తప్పించి ..."

"ఏం మాట్లాడ మంటారు ?"

"మీ యిష్టం. అయినా, మీకు మీ చదువు తప్పించి ఇంకేదీ పట్టదను కుంటాను."

"మనం పట్టించుకోప్పోయినా కొన్ని మనల్ని వదలవు కదండీ!" అంది సుజాత.

విక్టర్ కంగారుపడి, అంతలోనే సర్దు కొని "పరోక్షం కాదు కదా" అన్నాడు.

సుజాత చిన్నగా నవ్వుకుంది "నాకేద యినా నచ్చకపోతే సూటిగానే చెప్తాను. అది నా అలవాటు" అంది.

విక్టర్ మనసు కుదుట పడింది ... "బతికించారు" అన్నాడు.

కొన్ని క్షణాలు ఊరుకొని ... "ఎలా ఉన్నాయి మీ స్టడీస్" అంటూ అడిగాడు.

"ఏదో అలా సాగుతున్నాయి. చూడబోతే పరీక్షలు దగ్గరపడ్డాయి. భయంగానే ఉంది" అంది సుజాత తలెత్తి విక్టర్ వైపు చూసి.

"దానికేముందిలెండి. కాస్త మనసు పెట్టి చదివితే సరి."

## తమసోమా జ్యోతిర్గమయ

'ఇక మనసు పెట్టి చదివినట్టే' అనుకుంది సుజాత! తన ఆలోచనకు తనే సిగ్గుపడి చిన్నగా నవ్వుకుంది.

"మీలో మీరే నవ్వేసు కుంటున్నారు. కాస్త మాతో కూడా మీ ఆనందానికి కారణం చెప్తే..." విక్టర్ అన్నాడు.

"చెప్తే ఏంచేస్తారు ?"

"మేమూ సంతోషిస్తాం..."

"ఏమిటా సంతోషం ?" అంటూ కాఫీ కప్పులతో ప్రవేశించి తలకొక కప్పు అందించి,

---

## స్వాప్నికుడు

**– డా॥ దాశరథి**

పందులు విందులు చేసుకునేచోట
నందివర్ధనం పూలు పూస్తాయట!
దుర్గంధం దుర్భరంగా ఉన్నచోట
సుగంధ మారుతాలు వీస్తాయట!

రేపుమీద విశ్వాసం ఉన్ననేను
నేడు ఎలాఉన్నా భరిస్తాను!
మురికి కాలువ పక్కన కూర్చున్న నేను
సురనదీ పరిసరాలను ఊహిస్తాను!

కుటిల, కృత్రిమాల ఉక్కు చట్టం
కూలి ముక్కచెక్కలౌతుందని
నమ్ముతున్నాను;
సత్య, దయా, శాంతాల ధర్మచక్రం
నిత్యం పరిభ్రమిస్తుందని
విశ్వసిస్తున్నాను.

గొంగళి పురుగులా వికారమైన పేదలు
రంగుల సీతాకోకచిలకల్లా వికసిస్తారు;
కలం బలంతో జీవించాలనుకున్నవారు
కల నిజమయ్యేరోజులు చూస్తారు.

---

తనొకటి తీసుకొని, సుజాత సరసనే కూర్చుంది రజని.

"నేను రావడం కొంచెం ఆలస్యమైంది. మీకు కాలక్షేపం బాగానే జరిగిందను కుంటాను" అంది!

"నువ్వు లేకుండా కాలక్షేపమేమిటే?" అంది సుజాత!

"బాగా చెప్పారు" అన్నాడు విక్టర్ సమ ర్థింపుగా!

"తోడుదొంగల్లా ఈ సమర్థింపు లేమిటి" అని కిసుక్కున నవ్వి "నీ కివాళ ఆఫీసులేదా" అంటూ అడిగింది రజని విక్టర్‌ను.

"ఆదివారం ఆఫీసేమిటి ?"

"ఫరవాలేదే. వారాలు గుర్తున్నాయింకా. అన్నీ మర్చిపోయి ఉంటావనుకున్నానుసుమా"

"ఊరుకుందూ. నువ్వు మరీనూ" అంది సుజాత!

"ఏమ్మా. నీకు బాధగా ఉన్నట్లుందే మధ్యన" అంది రజని.

మాటలోనే సమయం యిట్టే జరిగి పోయింది. సంభాషణ సినిమాలమీదకు మళ్ళి అక్కడనుండి ఫేషన్లు ఇత్యాదులవైపు తిరిగి తిరిగి విహరిస్తుండగా శివరావుగారు వచ్చారు, లేచి!

"ఎంతసేపయిందయ్యా నువ్వు వచ్చి" అని అడిగారు వస్తూనే విక్టర్‌ని.

"చాలా సేపయిందండి. మీరు నిద్ర పోతున్నారు లేపడం దేనికని" అన్నాడువిక్టర్!

"ఏం నిద్రలే, పగటి నిద్ర" అని స్వగ తంలాగట్టిగానే అనుకొని "కృష్ణారావు దొరి కాడా" అంటూ అడిగారు శివరావుగారు.

"అతనికి అనుకోకుండ పోర్టులో ఉద్యోగం దొరికిందట, అందుకని రాలేనన్నాడు"

"శుభం! మంచిదే. అయినా తొందరేం లేదులే. వారం పది రోజుల్లో దొరికితేచాలు" అన్నారు శివరావుగారు.

"చూద్దాంలెండి" అని ఒక క్షణం ఆగి, "నేను రేపు విజయవాడ వెళుతున్నాను, నా ఫ్రెండ్ మేరేజ్‌కి! రెండు రోజుల్లో వచ్చే స్తాను" అన్నాడు విక్టర్!

"ఇంతకూ నీ పెళ్ళెపుడయ్యా' అన్నారు శివరావుగారు నవ్వి!

విక్టర్ కూడ నవ్వాడు. . 'తొందరేముం దండి" అన్నాడు చిన్నగా సిగ్గుపడినట్లయి.

"ఇక నేను వెళతానే" అంది సుజాత రజనితో!

"నేనూ వస్తున్నాను. జంక్షను వరకు కలిసేపోవచ్చు" అన్నాడు విక్టర్ తానూ లేచి.

"ఇంతసేపు బోర్ కొట్టింది చాలక... ఇప్పుడు వెంటపడ్డానని కోపంలేదు కదా ?" అన్నాడు విక్టర్. ఇద్దరూ బయటకు రాగానే!

సుజాత మాట్లాడకుండా నవ్వి ఊరు కుంది.

(46 వ పేజీ చూడండి)

# డాక్టర్ సుగుణ

ఎన్. రాజేశ్వరి

"డాక్టర్! డాక్టర్!" అర్ధరాత్రి ఒంటిగంట ప్రాంతంలో ఎవరో దడదడా తలుపు తట్టారు.

డాక్టర్ సుగుణ, ఇంకా నిద్రపోలేదు. అప్పుడే పక్కవీధిలో ఒకరికి సీరియస్‌గా వుందంటే, వెళ్లి వచ్చి తడిసిన బట్టలు మార్చుకుంది. ఒకసారి చప్పుడుకి, బహుశ వర్షంవల్ల అలా వినపడిందేమో అనుకుంది. కానీ, మళ్లీ అదే ధ్వని. వచ్చి తలుపు తీసింది.

అప్పటికే రిక్షా దిగి, గుమ్మంలో నుంచున్న అతను పూర్తిగా తడిసిపోయాడు. భుజంమీద నిండుగా కప్పిన పసిపాప. చటుక్కున లోపలి కొచ్చాడు. అతని క్రాఫంతా తడిసి నుదుటిమీదుగా నీళ్ళు కారుతున్నాయ్.

తలుపు తీసీతియ్యగానే, వెనుదిరిగి టవల్ తెచ్చింది: "ముందు మీరు తుడుచుకోండి." అంటూ అందించింది, అటు తిరిగి పాపని బెడ్‌మీద పడుకోబెడ్తున్న అతన్నుద్దేశించి.

ఇటు తిరిగి టవల్ అందుకుంటున్న అతను, ఆమె ముఖాన్ని చూసి ఉలిక్కిపడ్డాడు. "మీరు... మీరు...మీ...రా... !" అస్పష్టంగా గొణిగాడు.

ఆమె అప్పటికే గుర్తించింది. "అవును. నేనే..." చాలా నెమ్మదిగా అంది.

"బయట నేమ్ బోర్డు చూసి, ఇంకెవరో అనుకున్నాను."

"ఏం? నేనే అనుకుంటే రాకపోదురా?"

"అబ్బే! అలాటిదేంలేదు."

"ఆ ... ఇంతకీ?"

"అవును. పాపకి బాగా జ్వరంగా వుంది." అంటూ పక్కకి జరిగాడు. హై టెంపరేచర్! అంటూ హడావుడిగా తన పనిలో నిమగ్నమైంది.

అతను భయం భయంగా పాపనే చూస్తున్నాడు, ఆమె ఏం చెప్తుందోనని

"ఫర్వాలేదు. పాపకేం భయంలేదు. కానీ, యెందుకైనా మంచిది. ఓ నాల్గురోజులు పాపని యిక్కడే వుంచండి." అంది ప్రిస్క్రిప్షన్ రాసిస్తూ.

"చూడండి! యీ మందులు ప్రస్తుతం నాదగ్గర లేవు. రేపు నాలుగుకొట్లు గాలించైనాసరే తీసుకురండి. అవి వాడితీరాలి." అంటూ చింపిన కాగితం అందించింది.

"అదికాదు డాక్టర్..." సందేహంగా ఆగాడు.

"ఫర్వాలేదు. నాకు తెలుసు. పాప నిక్కడ వంటరిగా యెలా వుంచటం? అనేగా మీ సందేహం?"

"అవును. ఇంట్లో ఆవిడకి నిండునెలలు. ఆమె ఒక్కతే ఇంటికీ, ఇక్కడికీ మధ్య తిరగలేదు. నేను క్యాంపుకి వెళ్లిపోవాలి."

"ఫర్వాలేదు. ఆవిడకంత శ్రమ యివ్వకండి. మీ పాపకేం లోటురాదు. అన్నీ నేను చూసుకుంటాను. ఆఁ! ఇంతకీ ఆవిడ డెలివరీకి పుట్టింటికి వెడుతున్నారా? లేకపోతే యిక్కడికే తీసుకురండి. మీ బంధువు లెవరొచ్చినా రాకపోయినా, మీరు క్యాంపులో వున్నా, మీ పాపకీ, శ్రీమతికీ ఏ లోటు రాదు ... మీరు పూర్తిగా తడిసిపోయారు." అంటూ అతనివైపు చూసింది.

ఈదురుగాలికి చలికూడా బాగానేవుంది. ఒంటికి అతుక్కుపోయిన తడిసిన టెర్లిన్ షర్టులోంచి అతని బనీను, మిగిలిన తెల్లని శరీరం భాగం, లైటుకాంతి పడి తమాషాగా కనుపిస్తోంది. తడి తడిగా చెదిరిన క్రాఫు, తెల్లని విశాల



పాలభాగంమీద, నల్లగా, అక్కడక్కడ పడి, వింత అందంగా వుంది. తడిసినప్పుడు ఆడవాళ్లేకాదు, మగవాళ్ళుకూడా అందంగానే వుంటారు అనుకుంది. అతను తల పైకెత్తటంలో, చటుక్కున చూపు మరల్చి, "ఉండండి. ఒక్కక్షణం..." అంటూ లోపలికెళ్ళి, పొగలుగ్రక్కుతున్న కాఫీ తెచ్చింది... "తీసుకోండి" అంటూ.

"ఈ అర్ధరాత్రి ఎందుకండీ శ్రమ?"

## డాక్టర్ సుగుణ

"ఉహుఁ! మీరారోజు అర్ధరాత్రికాదుఁ? శ్రమపడింది?..."

"భలేవారె. మీకింకా గుర్తుందా?"

"అవును మీ మగవాళ్ళు మర్చిపోవటం సహజం. కానీ... స్త్రీలు తనకి మంచి చేసినా, చెడు చేసినా, ఆ వ్యక్తిని జీవితాంతం మర్చిపోరు."

"అబ్బా!... థ్యాంక్యూ... మళ్లీ రేపుదయం కలుస్తాను అంతవరకూ!" అంటూ లేచాడు పొగడ్తకి సిగ్గుపడుతున్నట్టు.

"మీ పాపకేం ఫర్వాలేదు. నిశ్చింతగా వుండండి." అంటూ ధైర్యం చెప్పి తలుపేసుకుంది వెళ్లిపోతున్న అతన్ని చూస్తూ... "ఎంత చిత్రం?" తను ఈనాడిలా డాక్టరౌతుందని కలలోకూడా అనుకోలేదు. ఆనాడు... అవును... ఆనాడు... గతం కళ్ళముందు కలలా కదిలింది

* * *

భార్యని నడిబజారులో అమ్మినవాడు, అడవులకి పంపినవాడు, జూదంలో ఓడిపోయి, విందు సభలో భార్యకి వలువలు వలుస్తుంటే, నిలువు గుడ్లేసుకుని, మౌనంగా తిలకించినవారు. వీరు మన భారతదేశంలో మనం గొప్పగా చాటిచెప్పుకునే పురుష పుంగవులు. ఆదర్శమూర్తులు. మనకి వీళ్ళంతా ఆరాధ్యదైవాలు. ఈ జాతికి చెందిన మహానుభావుడే తన భర్త. ఇలాంటి పవిత్రులకి భార్య తప్పొప్పులు న్యాయాన్యాయాలు, మంచి చెడ్డలు, విచారించే విచక్షణా జ్ఞానం వుండదు. అందుకే వీరంతా చిరస్మరణీయమైన చరితార్థులు. అటువంటి పుణ్యపురుషుడైన తన భర్త గుర్రపు పందాల్లో గెలవలేక, మగువల మధ్య తిరుగుతూ, మద్యంలోనె పూర్తిగా మునిగిపోయి, వ్యామోహంలో అన్నీ కోల్పోవటంతో అతని కంటికి భార్య భార్యగా కాక, మరోలా కన్పించటం మొదలుపెట్టేసరికి, పాపం! ఏం చేస్తాడు.. అర్ధరాత్రి నడిబజార్లోకి అక్రమంగా గెంటివేసాడు. అయితే ఆనాటి భార్యల్ని పతివ్రతలన్నారు. మరి... తనని అలా అనలేదు. అంతే తేడా. ఎందుకంటే మనం అలాంటి దేవతలం కాదుగనుక.

అయితే ఆరోజు బయట శీతాకాలపు ఎముకలు కొరికే చలి. అందరు లైట్లార్పుకుని, వెలుతురులో వున్నతనని, చీకటి కిటికీల్లోంచి వినోదం చూస్తున్నారు. ఆ నిశ్శబ్ద నిశీధిలో రోడ్డుమీద వంటరిగా తను. సాటి ఆడదానికి పరాభవం జరుగుతుంటే, బాధపడేవారికంటే, సంతోషించేవారె ఎక్కువగా వున్న రోజులు. అయితే తనని, ఆ రోజుల్లోలాగ, మనం సినిమాల్లో చూసినట్లు, కథల్లో వర్ణించినట్లు, ఎవరు అమాంతంగా ఎత్తుకుపోయి రక్షించెయ్యలేదు. కానీ అలాటిదే మరొకటి మాత్రం జరిగింది.

అందరికంటె, విరుద్ధంగా, అతను అదే ఎదురింట్లో అతను లైట్లన్నీ వేసుకుని గుమ్మంలోనే నిలబడి తిలకిస్తున్నాడు. తననుకుంది. ప్చ్! ఈయన మాత్రం ఎందుకు? తనని యిలా చూడటం? తలుపేసుకుని అందరిలా చీకట్లోంచి నాకు కనుపించకుండా నన్ను చూడచ్చుగా. ఎంత అమానుషం? నాకు తెలిసేలా నన్ను చూడటం; ఎంత ధైర్యం? మిగిలిన వాళ్ళకంటె క్రౌర్యం కాదూ? సాటి మగవాడి దౌర్జన్యాన్ని అరికట్టటానికి సాహసించలేని యితను... ఓ అబలని వినోదం చూస్తున్నాడు. ఆ జాతి అంతా ఒకటే... అనుకుంది కసిగా. కాళ్ళు లాగి లాగి గేటు ప్రక్కన కూర్చుంది. చలి. దోమల గోల, కటిక నేలమీద గుచ్చుకుంటున్న రాళ్లు. ఫోం బెడ్‌మీద పడుకునే తను... భర్త నీడ దాటితే పట్టిన గతి... ప్చ్

ఏ ఆడదానికీ యిలాటి పరిస్థితి వద్దు. అప్పటికే నిద్రమాత్రలు ఓ గుప్పెడు మింగేసింది. కళ్ళు కొద్దిగా మూతలు పడుతున్నాయ్. మత్తు ఆవహిస్తోంది. ఇక యీ జీవితానికి యీ ఒక్క రాత్రి. తెల్లగ్గా అనుకుంది. రేపటి రాత్రిని తను ఎదుర్కోవలసిన అవుసరం లేదు. అనుకుంటే మనసుకెంతో హాయిగా వుంది. కాకిమూకలాంటి ఈ సంఘంలో తను రేపు ఏమవనక్కర్లేదు. ఇంటా బయట నరకంలోంచి తను శాశ్వతంగా తప్పుకో వచ్చు. నిజంగా దేముడంటూ వుంటే తనింక బ్రతక్కూడదు. తనకి ఆ భగవంతుడు ఈ ఒక్క మేలు చెయ్యాలి. గట్టిగా అనుకుంది మనస్సులో. ఉహూ... అంత బాధలోను నవ్వు వచ్చింది. పోయే ప్రాణాన్ని నిలబెట్టమని భగవంతుడికి మొక్కుతారు. ముడుపులు చెల్లిస్తారు. కానీ, తను? ఆలోచిస్తుండ గానే అతను... అవును... అతనే దగ్గరకంటూ వచ్చాడు. తను గమనించనేలేదు.

"మీ కభ్యంతరం లేకపోతే ... యీ రాత్రికి మా యింట్లో పడుకోండి." మాటలో యెంత మంచితనం.

"ఉ...హూ...వద్దులెండి. రేపు మిమ్మల్ని కూడా అసభ్యంగా మాట్లాడతారు" అంది ఆశ్చర్యంతో, తన ఊహకి విరుద్ధంగా జరుగుతున్నందుకు.

"రేపటి సంగతి అప్పుడాలోచిద్దాం!"

"వద్దండీ! నేనెవరికీ మంచి చెయ్యలేను. చెడుమాత్రం ఎందుకు?"

అతను కదల్లేదు. మొండికేసాడు. పైగా అతని భార్య పుట్టింటికి వెళ్ళింది. ఎదురుగానే వున్నా, కనీసం ఆమెతోకూడా తన కెన్నడూ పరిచయంలేదు. అందరు తలుపులేసుకుంటే, ఇతనికిమాత్రం యెందుకీ బాధ? పైగా తను మాత్రలు మింగింది. ఏదైనా జరిగితే అతనిమీదకే రావచ్చు. వద్దు...వీల్లేదు. తను అసలే వెళ్లకూడదు. స్థిరంగా అనుకుంది. ఈ రోడ్డుమీద యిక్కడే యిలా దిక్కులేనిచావు చచ్చిపోవాలి. ఇది ఏ జన్మ పాపమో. అంతే! తనుమాత్రం వెళ్ళకూడదు. అతని పచ్చని జీవితానికి తనవల్ల కళంకం రాకూడదు. "వద్దు మిష్టర్! మీ మంచితనానికి మచ్చ తెచ్చుకోవద్దు!" కానీ అతను వినలేదు. మొండిపట్టు పట్టాడు.

సాధారణంగా అందమైన మనిషికి, మంచి మనస్సుండదంటారు. మరి రెండూ అందంగావున్న వారిని ఏమంటారో తన ఊహ కందలేదు. తనకి వాళ్ళింట్లో పడుకోక తప్పలేదు. అప్పటికే తనకి మగతతో కళ్ళు బరువెక్కుతున్నాయ్. ఇక్కడ పడిపోతే ఇతను గ్రహించేసి, ఆస్పత్రిలో పడేసి బ్రతికించెయ్యగలడు. తను బతకాలనుకోవటంలేదు. అంచేత కామ్‌గా పడుకోవటమే మంచిది, అనుకుంది అతన్ని అనుసరిస్తూ. ఎన్ని జతల కళ్లు పరికిస్తున్నాయో అనుకుంటే నవ్వు వచ్చింది. అంతే! ఇక తనకేం తెలియదు. ఆ తర్వాత అమ్మ చెప్పింది

ఆ మర్నాడు ఉదయం ఎంతకీ లేవకపోవటంతో, అతనికి భయంవేసి, ఇరుగుపొరుగుల్ని పిలిచాడట. వాళ్ళ సహాయంతో ఊళ్ళో వున్న బాబాయికి ఫోన్ చేసి, అమ్మకి కూడా వైరిచ్చారని చివరి క్షణంలో ఆస్పత్రిలో పడేసి తనకి, అందరు కలిసి ప్రాణం పోసేసారని. అతనే రక్షించకపోతే ఆ రాత్రి, తను అలా రోడ్డుపక్కని చచ్చిపడివుండేదని... అంతే అనాటినుంచి తనింక అమ్మదగ్గిరే వుండిపోయింది. ఇక భర్త మాట తలపెట్టలేదు. అప్పటికే తను పి. యు. సి. పాస్ అవటంతో, వెంటనే యీ డాక్టరు కోర్సు చదివి, యిక్కడ యీ పల్లె బస్తీ కాని ఊళ్ళో, ప్రాక్టీసు పెట్టుకుని, జీవితాన్ని గడిపివేస్తోంది. భర్త మళ్లీ పెళ్లి చేసుకున్నాడని ఎవరో చెప్పగా వింది. అయినా యిక తనకి అనవసరం. తనకీ జీవితం ఎంతో తృప్తిగా వుంది. డాక్టరుగా ఎంతోమందికి సేవ చేయగలుగుతోంది. మానవ సేవే, మాధవ సేవ అన్నారు. చాలు. ఈ జన్మకీ పుణ్యం. అనుకుంటూ, పాపని సమీపించింది. కాకతాళీయంగా యితను కలవటం, తను డాక్టరు కావటం అంతా చిత్రం!

## శిల్పాలకు ఊపిరులు

అవి శిలలు —
రేపు ప్రభవించే శిల్పాలకు ఊపిరులు
వన్నెల రసరేఖల ప్రసవించే విరులు

అవి మోళ్ళు —
రేపు చిగిర్చి విచ్చుకునే ఆకుల సెలయేళ్ళు
నిరాశలోనుండి ఉదయించే నిప్పులాంటి
విశ్వాసానికి ప్రతీకలు

అవి మొండిగోడలు —
రేపు వెలిసే అపూర్వ భవనానికి పునాదులు
విరిగిన కెరటాల్లోనుండి విజృంభించే
ప్రవాహాలకు ప్రతినిధులు

అవి మట్టి పిడికిళ్ళు —
యీ దేశాన్ని పాలించే నిప్పుల కళ్ళు
చెమటలోనుండి వికసించిన రంగుల హరివిల్లు.

— రామా చంద్రమౌళి

తృప్తిగా నిట్టూర్చి, సమీపంలోనె వున్న తన బెడ్ మీద నడుం వాల్చింది.

* * *

"అబ్బబ్బా! గీతా! నేను చెప్పేది, నీ కర్థం కాదు"

"నాకేం అర్థం కావక్కర్లేదు. అదేగా దాని దగ్గిరకే మీ పాపని తీసుకెళ్ళారట. అది చెప్పినట్టు నేను అక్కడికే వెళ్లాలట. ఇంకెక్కడ దిక్కు లేనట్టు. ఛీ...ఛీ... మీకు సిగ్గు లేకపోతే వందసార్లు వెళ్ళండి. అక్కడే కులకండి. నేను పుట్టింటికి పోతే మీ కసలీ అడ్డంకూడా వుండదు. ఆ రోజు చుట్టుపక్కల యిరుగు పొరుగు వాళ్ళంతా ఎంత అసహ్యంగా చెప్పుకున్నారు? ఏం? అందరి మొగాళ్ళకి లేని ఆదర్శం మీకే వచ్చిందా? పైగా నేను లేనప్పుడు, పరాయి ఆడదాన్ని యింట్లో ఎలా వుంచుకున్నారు? ఏం? మిగిలిన వాళ్ళెందుకు చెయ్యలేదూ? మీ ఒక్కరికే వచ్చిందా అంత గొప్ప? నేను వచ్చిన మర్నాడు ఎంత గుసగుసలు ఎంత నీచంగా చెప్పుకున్నారు? చివరికి యిల్లు కూడా ఖాళీ చెయ్య వలసివచ్చిందే? పాతబం పోయిందనుకున్నాను. మళ్లీ ఇక్కడ దాపురించిందన్న మాట? అదేదో మీరే వెళ్లి కులకండి..."

"గీ ... తా ... యు ... షటప్!" చెంప ఛెళ్ళుమంది ఛీ...ఛీ...తల పట్టుకుని భారంగా కూలబడ్డాడు.

"అవునండీ! కొడ్తారు. కొట్టకేం చేస్తారు? యెంత నీచానికైనా దిగుతారు. అసలీ మగవాళ్లే యింత..." కసిగా తిడుతూనేవుంది గీత. ఎందరెన్నో కూసినా, కనీసం భార్య అయినా అర్థం చేసుకుంటుం దనుకున్నాడు తను. ఇందులో తను చేసిన నేరం ఏమిటి? పాపం! ఆమె తప్పుమాత్రం ఏముంది? ఆ పరిస్థితిలో తన అక్కో చెల్లెలో వుంటే ఏం చేస్తాడు? తనూ అదే చేసాడు. ఈ కుళ్లసమాజంలో కుళ్ళు మనుషులకే ఎక్కువ స్థానం. మంచిని అర్థంచేసుకునేవారే లేరు. ఆమె బ్రతికి బయటపడి యీనాడు ఎందరికో ప్రాణదానం చేస్తోంది. అటువంటి దేవతకి ఇంతటి కళంకం వద్దు...వద్దు. ఊహించడానికే అసహ్యంగా వుంది వద్దు ... వద్దు సుగుణా! నీ మంచితనమే నీకు రక్ష! అనుకుంటూ బరువుగా కళ్లు మూసుకున్నాడు కృష్ణప్రసాద్.

మర్నాడు ఆమె రాసినప్రకారం మందులు తీసుకెళ్లాడు. అదేరోజు సాయంత్రం తను క్యాంపుకి వెళ్లిపోతున్నట్టు, తన భార్య గనుక వస్తే చూసుకోమని, ఇద్దరి బాధ్యత అప్పగించి వెళ్లిపోయాడు.

భార్యాభర్తలిద్దరి మధ్య మౌనం. ఆమె వెళ్ళనని చెప్పినా వినిపించుకోకుండా నిర్లక్ష్యంగా వెళ్లిపోతున్న భర్తమీద విరుచుకుపడింది గీత.

మర్నాడు పాపకోసం తప్పనిసరిగా వచ్చింది గీత. మనసులో కసి, ద్వేషం. పైకిమాత్రం సభ్యతకోసం మాట్లాడింది.

ప్రస్తుత పరిస్థితికి అక్కడ అంతకంటె మరో ప్రయివేటు డాక్టరు లేదు. గవర్నమెంట్ హాస్పటల్ వున్నా, మనలాంటివాళ్లు అడుగుపెట్ట లేరు. పైగా లేడీడాక్టరు లేదు. ఇక యీవిడ తప్పదేమో, అనుకుంటె మనసు భగ్గుమంది గీతకి. వీల్లేదు. ఆయన వచ్చాక దెబ్బలాడి పుట్టింటికే వెళ్లిపోవాలి. మనసులోనె నిర్ణయించుకుంది సభ్యతకోసం పొడిపొడిగా మాట్లాడి, పాపని చూసుకుని వెళ్లిపోయింది.

మనం అనుకున్నట్లుగా అన్నీ జరగవ్. మన కిష్టం లేకపోయినా, ఒక్కొక్కప్పుడు పరిస్థితులకు తల ఒగ్గక తప్పదు. గీత పరిస్థితి అంతే అయింది. ఆ రోజు ఉదయం నుంచి వంట్లో నలతగానే వుంది. క్రితం రోజు రాత్రికే వస్తానని చెప్పి వెళ్లిన భర్త యింకా రాలేదు. పుట్టింటికి వెళ్లాలనుకున్న గీతకి, అప్పుడే నొప్పులు మొదలయ్యాయ్. పక్కింటి పిన్నిగార్ని సలహా అడిగింది ఆవిడ "ఫర్వాలేదమ్మా! సుగుణ చేతి చలవ మంచిదే. పైగా పిల్లకూడా అక్కడే వుంది గనుక, యింక సందేహం ఎందుకు



'జీవితంలో వసంతం'లో ప్రభ

# * సినిమా విశేషాలు *

## హిట్ పాటలున్న అక్కినేని చిత్రం

సుగుణా పిక్చర్స్ నిర్మించిన కాస్ట్లీ వర్ణచిత్రం "రాజా రమేష్" అందరినీ ఆకర్షించే అన్ని హంగులను గొనియున్నది. జులై ఏడున విడుదలయ్యే యీ చిత్రంలో అక్కినేని... వాణిశ్రీ... జగ్గయ్య గార్ల పోటీ నటన ప్రేక్షకుల ప్రశంస అందుకుంటుంది.

ఇందులో పాటలు :

ఒకటి : "ఎంతో రసికుడు దేవుడు"

రెండు : "నింగి మీద జాబిలి"

మూడు : "చంద్రుడు కనపడలేదని"

నాలుగు : "వాయించు ఆదితాళం".

పై సుదహరించిన పాటలను బాలు... సుశీల ఎంతెంతో తియ్యగా పాడారు. "మామ"కు మరింత పేరు వస్తుంది.

"రాజా రమేష్" వర్ణచిత్రాన్ని బహుజన రంజకంగా రూపొందించే ప్రయత్నంలో విక్టరీ మధుసూదనరావు మళ్లీ జయించారు. చిత్రం ఆద్యంతం ఆసక్తిదాయకంగా వుండేట్టు దర్శకునికి, ఎడిటర్ సంజీవి తోడ్పడ్డారు

"రాజా రమేష్" చిత్రానికి ఆచార్య ఆత్రేయ, ఛాయాగ్రహణ దర్శకుడు సెల్వరాజ్, సంగీతసారధి మహదేవన్ మూలస్తంభాలు.

ఒక స్వీట్ పిక్చర్‌ను నిర్మించిన ఎమ్. శేషగిరిరావును ప్రేక్షకులు నిండు మనసుతో అభినందిస్తారు.

వరుసగా విజయపరంపరలను అందుకుంటూ వస్తున్న విక్టరీ... అక్కినేని... వాణిశ్రీగార్లకు "రాజా రమేష్" ఘన విజయాన్ని చేకూర్చగలదన్న నమ్మకం యీ విలేఖరికి ఏర్పడింది.

## క్రాంతికుమార్ చిత్రంలో అక్కినేని

అభిరుచివున్న మంచి నిర్మాత శ్రీ క్రాంతికుమార్ అని చెప్పడానికి ఆధారాలు మాణిక్యాల్లాంటి మూడు చిత్రాలున్నాయి. "శారద... ఊర్వశి... జ్యోతి".

శ్రీ క్రాంతికుమార్‌కు, అగ్రనటునితో సినిమా తీయాలన్న తలంపు "శారద" చిత్ర నిర్మాణం నాటినుంచి వుంది.

ఆయన కోరిక జూన్ 11న యీడేరింది. "కళాప్రపూర్ణ" శ్రీ నాగేశ్వరరావు, శ్రీ అన్నపూర్ణా సినీ ఎంటర్ ప్రైజస్ అధినేతకు పని చేస్తానని మాట యిచ్చారు.

"స్టార్ డైరెక్టర్" శ్రీ రాఘవేంద్రరావు... అక్కినేని చిత్రానికి దర్శకత్వం నిర్వహించడం, క్రాంతికుమార్ చిత్రంతో ప్రారంభమవుతుంది.

సుగుణ దగ్గరికి ? పద..." అంటూ, రిక్షాలో కూడా వెళ్లి దింపింది.

అబ్బాయ్ రాగానే పంపుతాను తల్లీ. మరేం దిగులు పడకు. మీవాళ్ళకికూడా ఓ టెలిగ్రాం కొడితే రేపటికల్లా వస్తారు. అందాకా మేమంతా వున్నాం" అంటూ ధైర్యం చెప్పి వెళ్లిపోయింది పిన్నిగారు.

గీతకి కానుపు చాలా కష్టమైంది. సుగుణకి ధైర్యం చాలక, గవర్నమెంట్ హాస్పటల్‌లో వున్న మరొక డాక్టరు నరేంద్రని పిలిపించింది. చివరికి అతను కలుగచేసుకుంటేకాని, డెలివరీ కాలేదు. మొత్తంమీద తల్లి పిల్ల కులాసాగా వున్నారు. తేలిగ్గా నిట్టూర్చింది సుగుణ.

చూడు గీతా ! ఎంత నీరసపడిపోయావో ! అంటూ బెడ్‌మీద కూర్చుని, ఆమె నుదుటిమీద ముంగురుల్ని సవరించాడు.

"మీ పంతమే నెగ్గిందా ? బ్రతికిపోయి మీ కడ్డుగా వుండిపోయానని బాధగా వుందా ?"

"గీతా... ఏమిటి నువ్వంటున్నది ?" అసహనంగా అన్నాడు.

"అవునండీ ! మీరు వూళ్ళో లేకపోవటంవల్ల నేనిక్కడికి రాలేదు. మీరున్నా నన్నిక్కడికే తీసుకొచ్చేవారు. పాపం ! నా బాధ మీకు మళ్లీ తప్పలేదు. అంత డాక్టరయివుండీ యింత తెలివితక్కువగా నన్నెందుకు బ్రతికించినట్లు ? మంచి మిగలాలనా ?"

"ఛీ...ఛీ...గీతా ! నీకు ... నీకు ... నీకర్థం కాదు.

"కృష్ణగారూ ! మీరో నిముషం తప్పుకుంటారా ?" అతన్ని మధ్యలో అడ్డుకుంటూ ప్రవేశించింది సుగుణ.

## డాక్టర్ సుగుణ

ఇద్దరూ ఉలిక్కిపడ్డారు, ఆవిడ వినిందేమో అనుకుంటూ.

"డాక్టర్ ! మీరు ... మీరు...' అర్థోక్తిలో ఆపేసి వెళ్లిపోయాడు.

గీత కూడా కొంచెం చిన్నబుచ్చుకుంది.

"గీతా ! నీకు చాలా రెస్ట్ కావాలమ్మా ! యెక్కువగా ఆలోచించవద్దు. నిన్న వచ్చిన డాక్టరు మళ్ళీ యిప్పుడు వస్తారు. నీకేమైనా బాధలుంటే వారికికూడా చెప్పు. సరిఅయిన మందు వాడవచ్చు."

ఆ మంచితనంతో గీత నోటంట మాట రాలేదు. "డాక్టర్ ! ఒక్క మాట అడగనా ?"

"అడుగమ్మా !"

"నిన్న డెలివరీ చేసింది అతనేటగా ?"

"అవునూ."

"అయితే ఆ సంగతి మావారికి తెల్సా ?"

"గట్టిగా నవ్వింది. భలేదానివే ! అసలతనేగా, ఆ డాక్టర్ని దగ్గిరుండి తీసుకొచ్చారు."

"నిజంగా ?" వెరగుపడింది గీత.

"అవును. నిజం."

"ఏమిటి ? తన డెలివరీకి మగ డాక్టర్ని అతనే దగ్గిరుండి తీసుకొచ్చారా ? యెంత మంచితనం !" ఆశ్చర్యపోయింది గీత.

"అవునమ్మా ! నేనే తీసుకురమ్మన్నాను. చూడు గీతా ! ఒక చిన్న విషయం చెప్పాలనుకుంటున్నాను. మీ సంభాషణ విన్నందుకు మన్నించు. కానీ, అతనిమీద నీకున్నది దురభిప్రాయం. నువ్వు పొరబడుతున్నావమ్మా ! చూడు ! డాక్టరు ఆడ అయినా, మగ అయినా పేషెంట్లు ఆడ మగా అంతా వస్తారు. అందరినీ సమానంగా ఆదరించి పంపటం డాక్టరు ధర్మం. అంతమాత్రాన, అక్రమ సంబంధాలుండవు కదా ! అలాగే ఆపదలో వున్నవారు ఎవరైనా ఆదరించటం మంచివాళ్ళ ధర్మం. అంతే జరిగింది. అంతకంటె మరోలా భావిస్తే, నేను దురదృష్టవంతురాలిని..." బాధగా అంది సుగుణ.

"క్షమించండి డాక్టర్...!"

"ఫర్వాలేదు. ఇది ఆడవారి సహజగుణం. నీ తప్పేంలేదు." అంటూ వచ్చిన పని పూర్తిచేసుకుని స్టెతస్కోప్‌తో వెళ్లిపోయింది. పది రోజుల తర్వాత అతను ఆమెని యింటికి తీసుకుపోతూ...

"డాక్టర్... మీ బిల్లు...!"

"భలేవారే... నా...కు... మీరు... బిల్లు చెల్లిస్తారా ? ఎంత న్యాయం అండి ?"

'అంటె మీ ఉద్దేశ్యం ?"

"నేనిలా డాక్టరు కావడానిక్కారణం ...ఆనాడు మీరు కాదూ ! వద్దు మిస్టర్. మీ దగ్గర బిల్లు తీసుకోవటం నావల్ల కాదు "

అతను బలవంతపెట్టినా ఆమె పుచ్చుకోలేదు అతను భార్య పిల్లల్ని తీసుకుని రిక్షా ఎక్కాడు.

"నేను మిమ్మల్ని అపార్థం చేసుకున్నానండీ! వెరీ... సారీ !" అంది గీత... రిక్షాలో దగ్గరగా జరిగి కూర్చుంటూ.

"పోన్లే... యిప్పుడర్థం చేసుకున్నావ్‌గా." అంటూ మరింత దగ్గరగా జరిగి, ఆమె నడుం చుట్టూ చెయ్యి వేసి, యింకా దగ్గరగా అదుముకున్నాడు. ఆమె బాలెంత అనీ, అది రిక్షా అనీ మర్చిపోయిన కృష్ణప్రసాద్. దూరంనుంచి గమనిస్తున్న డాక్టర్ సుగుణ...

"లాంగ్... లివ్... మై... డియర్..." అస్పష్టంగా గొణుక్కుంది.

## మారుతిలో అక్కనేని

"రాజా...బాబు" వంటి భారీ వర్ణ చిత్రాలను నిర్మించిన మారుతీ ప్రొడక్షన్స్ జూన్ పదకొండున వేరొక మంచి పనిని చెయ్యడం జరిగింది.

"నటసామ్రాట్" నాగేశ్వరరావుగారు "రాజా రమేష్" డబ్బింగ్‌కని మదరాసు వచ్చిన రోజున, నిర్మాత ఎ. ఎల్. కుమార్, దర్శకుడు జి. సి. శేఖర్ ఆయన్ను కలిశారు.

మీరు మా సంస్థలో పని చెయ్యగలరా అని నిర్మాత అడిగారు. "బలేవారండి! పని చెయ్యడానికేగా వుండేది", అంటూ వచ్చిన ఇద్దరినీ తన స్వారస్య సంభాషణలో ఉత్సాహపరచారు.

శేఖర్‌ను చూపించి, "మా చిత్రానికి యితడే దర్శకుడు" అని కుమార్ చెప్పినప్పుడు, తనకు శేఖర్ చాలా ఏండ్ల నుంచి తెలుసని, మంచి టెక్నీషియన్ దగ్గర పని చెయ్యడానికి అభ్యంతరం లేదని, అక్కినేని తన సుముఖతను ప్రదర్శించారు.

తన అభిమాన నటుడితో చిత్రం తీసే అవకాశాన్ని, అక్కినేని కలిగించినందుకు, దర్శకుడు శేఖర్ ఆ మహానటుడికి కృతజ్ఞతలు తెలిపారు.

మారుతీ ప్రొడక్షన్స్ అక్కినేనితో నిర్మించనున్న కాస్ట్లీ వర్ణ చిత్రం జనవరి నుంచి ప్రారంభమవుతుందన్న వార్తను, నిర్మాత కుమార్ తెలిపారు.



# సినిమా

## విక్టరీ త్రయానికి మరొక చిత్రం

ఈమధ్య విడుదలై విజయాన్ని చవిచూచిన "దాగ్" హిందీ చిత్రాన్ని శ్రీ ఉమాలక్ష్మి కంబైన్స్ అధినేతలు పద్మాక్షి... పుష్పాభట్‌గార్లు కొన్నారని పాఠకులకు తెలిపి ఆరేడు మాసాలయ్యింది.

జూన్ యిరవై ఏడు నుంచి వరుసగా నెల రోజులు పని చెయ్యడానికి "నటసామ్రాట్" యిచ్చిన కాల్‌షీట్లకు అనుకూలంగా, అగ్రనటి వాణిశ్రీ... గుమ్మడి... నాగభూషణం... మోహన్‌బాబు... ధూళిపాళ మరియు జయసుధ తేదీలను యిచ్చారు.

"విక్టరీ త్రయం" అంటే (నాగేశ్వరరావు... వాణిశ్రీ... మధుసూదనరావు) కలిసి పనిచేస్తున్న మరో చిత్రం "దాగ్".

ఈ కరుణ... సంగీత... శృంగార చిత్రానికి బొల్లిముంత రచన్ను, వి. ఎస్. ఆర్. స్వామి ఛాయాగ్రహణాన్ని, జి. వి. సుబ్బారావు శిల్పాన్ని, కోదండరామిరెడ్డి సహదర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు.

## అక్కినేని... చక్రవర్తి

అక్కినేని చిత్రానికి చక్రవర్తి సంగీతం సమకూర్చడం యీ చిత్రంతోనే ఆరంభం. ఆయన రికార్డ్ చేసిన మూడు పాటలను విన్నప్పుడు, ప్రత్యేక శ్రద్ధ తీసుకున్న నిజం ట్యూన్సులో వినిపించింది.

చిత్రంలో ఆరు పాట లుంటాయని, అన్నిటిని హిట్ చెయ్యడానికి తను ప్రయత్నించగలనని చక్రవర్తి నమ్మకాన్ని వ్యక్తపరచారు.

## సిమ్లా లొకేషన్

శ్రీ ఉమాలక్ష్మి కంబైన్స్ అవుట్‌డోర్ లొకేషన్‌గా "సిమ్లా"ను ఎంపిక చేసినట్లు తెలిసింది. "పిక్నిక్ సాంగ్"ను అక్కడ చిత్రీకరిస్తారు అన్నపూర్ణా ఫిలింస్ విడుదల.

## అక్కినేని చిత్రల ఆటుపాటలు

శృంగార నాయకుడు అక్కినేని... చిలిపి నాయిక జయచిత్ర కలిసి ఆడుతూ పాడిన మూడు పాటలను, నృత్య దర్శకుడు హీరాలాల్ విభిన్న భంగిమల్లో చిత్రీకరించడంతో (కొడైకెనాల్‌లో) మొదటి షెడ్యూలు, విజయ .. మాధవీ పిక్చర్స్ వారిది పూర్తయింది.

శ్రీ తాతినేని కథ వ్రాసి, దర్శకత్వం నెరపుతున్న యీ రంగుల చిత్రానికి సత్యానంద్ రచన్ను, రాఘవులు సంగీతాన్ని, సెల్వరాజ్ ఛాయాగ్రహణాన్ని, జి. వి. సుబ్బారావు కళను, జి. జి. కృష్ణారావు కూర్పును, రామమోహన్, శరత్‌కుమార్ సహదర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు.

శ్రీ వడ్డే శోభనాద్రి నిర్మిస్తున్న యీ కొత్త తరహా చిత్రంలో సత్యనారాయణ, రావు గోపాలరావు, రాజబాబు, మోహన్‌బాబు, జయమాలిని, ఛాయాదేవి మరియు మురళీమోహన్ ముఖ్య పాత్రధారులు.



'భద్రకాళి'లో జయప్రద




## వీరి కుటుంబము ఉత్సాహపూరితమైనది
## ఎందుకంటే వీరి జీవితాన్ని ఆనందభరితంగా చేసేది...

# వింకోల-12

## విటమిన్ బి-12 కల ఐరన్ టానిక్
## శక్తితో ఆరోగ్యంగా వుండుటకు

ఆరోగ్యాన్ని చేకూర్చుతుంది. జీవితంలో ఆనందాన్ని అధికం చేస్తుంది.
ప్రతి దినము వింకోల-12 తీసుకోండి.

వింకోల-12 మీ శరీర శక్తిని రెట్టింపు చేస్తుంది. ఎందుకంటే,
దీనిలో ఆరోగ్యాన్ని అధికంచేసే ధాతువులు వున్నవి. ఐరన్ మరియు బి-12
సంతులిత ప్రమాణములోను, మరియు గ్లిసరోఫాస్ఫేట్లు గలవు.
వింకోల-12 యొక్క ప్రతి బిందువు శక్తిసాగరము.




ఇందువలన, మీరూ అమోల్ పాలేకర్ యొక్క కుటుంబము
లాగ మీ కుటుంబమునకూ వింకోల-12 ఇవ్వండి. శక్తి
మరియు ఆరోగ్యాన్ని అధికం చేసుకోండి.

స్టాండర్డ్ ఫార్మస్యూటికల్స్ లిమిటెడ్




Shilpi-SPL-1a/77 tel

# సినిమా



'జన్మజన్మల బంధం'లో వాణిశ్రీ, కృష్ణ

## శ్రీ రామానాయుడు

తెలుగుదేశంలోనే గాక, ఉత్తరదేశంలో కూడా తనకొక "ఇమేజ్"ను ఆర్జించుకున్నారు, సురేష్ అధినేత. శ్రీ రామానాయుడు "గ్లామర్ నిర్మాత" అని నిరాక్షేపణీయంగా పేర్కొనవచ్చు. హీరోలకున్న గ్లామర్ నాయుడుగారికి వుంది.

ఈమధ్య ఒకరోజున, ఆయన్ను బోగ్‌రోడ్డు ఆఫీసులో కలిశాను. ఆయన్ను చూడడానికి వచ్చిన వాళ్లలో దర్శకులు, నటులు, కవులు, రచయితలు, పాత్రికేయులు, మరెందరో వున్నారు

రోజూ రెండుగంటల వ్యవధిని ఇంటర్వ్యూలకు సురేష్ అధినేత కేటాయించినట్లు తెలుసుకున్నాను. వచ్చిన ప్రతివొక్కరినీ, ఆయన పలకరించి ఉచిత రీతిలో రిప్లయి యిస్తారని తెలుసుకున్నాను.

ప్రస్తుతం ఆయన దగ్గర ఆరు కథలు చిత్ర నిర్మాణంకోసం ఎదురుచూస్తున్నట్లు తెలిపారు. తెలుగు ... హిందీ ... తమిళ భాషల్లో చిత్రాలు నిర్మించేందుకు, నాయుడుగారు ఆయా భాషలకు సంబంధించిన వ్యక్తులకు ఆయా బాధ్యతలను అప్పచెప్పారు. వచ్చే జూన్ వరకు తన సంస్థకు ఒక్కరోజుకూడా విశ్రాంతి వుండదని ఆయన అన్నారు.

## చిలిపికృష్ణుడు

"నటసామ్రాట్" నాగేశ్వరరావు ... అగ్రనటి వాణిశ్రీ "ప్రేమనగర్" లెవల్ పాత్రలను పోషించనున్న "చిలిపికృష్ణుడు" వర్ణ చిత్రం సెప్టెంబర్ ఒకటి నుంచి అన్నపూర్ణా స్టుడియోస్‌లో వరుసగా మూడు పక్షంరోజులు జరుగుతుందని, వచ్చే సంక్రాంతికి చిత్రం విడుదలవుతుందని శ్రీ నాయుడు చెప్పారు.

"చిలిపికృష్ణుడు" వర్ణ చిత్రానికి ఆచార్య ఆత్రేయ రచన్ను, మహదేవన్ సంగీతాన్ని, సుందరం ఛాయాగ్రహణాన్ని, జి. వి. సుబ్బారావు శిల్పాన్ని నిర్వహిస్తారు.

అక్కినేని ... వాణిశ్రీగార్ల చిత్రం తనకు యిచ్చిన రామానాయుడుగారికి ఆజన్మాంతం ఋణపడి వుండగలనని, దర్శకుడు బోయిన సుబ్బారావు అంజలి ఘటించారు.

ఈ చిత్రంలో సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, రాజబాబు, సూర్యకాంతం, శ్రీవిద్య ముఖ్య పాత్రధారులు. నవయుగ విడుదల.

## మిగతా అయిదు

సురేష్ సంస్థ నిర్మించనున్న మిగతా అయిదు చిత్రాలు. "మొరటోడు" హిందీ జీవనతరంగాలు... సావాసగాళ్లు. తమిళంలో "సొగ్గాడు ... సావాసగాళ్లు."

## విదేశయానం

సంవత్సరమంతా బిజీ పనులతో వుండే రామానాయుడుగారికి కొంత విశ్రాంతి...వాతావరణం మార్పు అవసరం. అందుకనే ఆయన జులైలో విదేశాలను పర్యటించడానికి ప్లాన్ చేశారు.

నెలరోజులు యీ సినిమా కార్యక్రమాలకు దూరంగా వుండాలన్నది ఆయన ఉద్దేశ్యం.

## వచ్చే సంవత్సరం శివాజీ

పద్మాలయా సంస్థ "ఛత్రపతి శివాజీ" చిత్రాన్ని సినిమాస్కోప్‌లో నిర్మించేరోజు దగ్గర్లోనే వుందన్న వార్తను, కథానాయక పాత్రధారి కృష్ణ తెలిపారు

"వచ్చే సంవత్సరం "శివాజీ" చిత్ర నిర్మాణం తప్పక జరుగుతుంది. అన్నారు హీరో కృష్ణ.

ఈ సంవత్సరం సెప్టెంబర్ ప్రాంతంలో రాజశ్రీ వ్రాసిన కథను, పద్మాలయా చలనచిత్రంగా నిర్మించగలదని, ఆ చిత్రానికి ప్రముఖులు పని చెయ్యగలరని, కృష్ణ చెప్పారు

"పట్నవాసం" చిత్రానికి ముగ్గురు నాయకులు అవసరమని, అందుకనే కాస్త ఆలస్యం అనివార్యమయ్యిందని, కృష్ణ తెలిపారు.

హీరో కృష్ణగారు తీసుకున్న నిర్ణయంలో నూరు శాతం న్యాయం ధ్వనించింది.

వచ్చే ప్రతి చిత్రాన్ని అంగీకరించి, ఎక్కువ స్ట్రెయిన్‌కు గురికావడంకన్న, నచ్చిన కథలకు మాత్రమే "ఎస్" అనడంవల్ల, మానసికంగా. భౌతికంగా ఆనందం ఏర్పడుతుంది అని కృష్ణ చెప్పిన నిజంలో యెంతో న్యాయం వుందనిపించింది. తీసుకున్న నిర్ణయానికి అనుకూలంగా ప్రవర్తించే స్వభావం వున్న వ్యక్తిగాబట్టే, కృష్ణగారి చిత్రాలు తక్కువగా వస్తున్నాయి.

"సావాసగాళ్లు...ఈనాటి బంధం ఏనాటిదో" చిత్రాలలో కృష్ణ వెరైటీ పాత్రలను పోషించినట్టే, రాబోయే "ఇంద్రధనుస్సు...పంచాయతీ" చిత్రాలలో వైవిధ్యం వున్న వేషాలను ఆయన నిర్వహించారు.

## ఏకలవ్య పాత్రపై మోజు

హీరో కృష్ణకు "ఏకలవ్య" పాత్రపై మోజు వున్నట్టు, ఆయనతో జరిపిన సంభాషణలో తెలిసింది.

"ప్రజాదర్శకుడు" దాసరికి "ఏకలవ్య" చిత్రంపై మోజు ఏర్పడి రెండేండ్లు అయ్యింది.

తమిళ రచయిత ధర్మరాజు వ్రాసిన "ఏకలవ్య" ట్రీట్‌మెంటును యెవరు విన్నా, ఆ చిత్రంపై అభిలాష ఏర్పడుతుంది.

"ఏకలవ్య" చిత్రాన్ని నిర్మించే ఉద్దేశ్యం దిడ్డి శ్రీహరిరావుకు, ఎస్.వి.ఎస్. చంద్రకుమార్‌కు, మావుళ్లయ్యకు, హీరో కృష్ణకు వున్నది.

ఎవరు నిర్మించినా, ఆ పాత్రకు కృష్ణ నూరుశాతం న్యాయం చెయ్యగలరని, యీ విలేఖరి అభిప్రాయపడుతున్నాడు.

## రిలీజ్‌కు ముస్తాబవుతున్న చిరంజీవి రాంబాబు

పద్మజా ఆర్ట్ పిక్చర్స్ పతాకం క్రింద కె. కుటుంబరావుగారు నిర్మిస్తున్న "చిరంజీవి రాంబాబు" వర్ణచిత్రం ప్రముఖ దర్శకులు శ్రీ తాతినేని ప్రకాశరావుగారి దర్శకత్వంలో విడుదలకు ముస్తాబవుతూంది. ఇదొక చక్కటి కుటుంబ గాథా చిత్రం. ఈ చిత్రంలోని పాత్రలను గూర్చి క్లుప్తంగా తెల్సుకుందామా!

రాఘవరావు: బాలయ్య; పంచాయతీ బోర్డు ప్రెసిడెంటు. సహృదయుడు, సాధుస్వభావి. రత్తమ్మ: జమున; రాఘవరావుగారి శ్రీమతి; బోళామనిషి. మధు: రంగనాథ్; రాఘవరావుగారి తమ్ముడు; పట్నంలో చదువుకున్నాడు. మంచి, మర్యాద తెల్సినవాడు, నీతి, న్యాయం పాటించాలనే పట్టుదల గలవాడు. శారద: మంజుల; మధు భార్య. రంగడు: మాస్టర్ రాము; రాఘవరావు, రత్తమ్మల కొడుకు. అల్లరి పిల్లాడు. రాము: బేబీరోహిణి; రత్తమ్మగారి తమ్ముడు. మంచివాడు. భయం, భక్తి కలవాడు. కనకారావు: అల్లు రామలింగయ్య; ధనవంతుడు, వడ్డీకి డబ్బులిస్తుంటాడు. లక్ష్మయ్య: కొమ్మినేని శేషగిరిరావు; శారద తండ్రి. కనకారావు దగ్గర గుమస్తాగిరి చేస్తుంటాడు.

ఈ పాత్రలు కాక చిత్రంలోని తదితర పాత్రలను సారథి, త్యాగరాజు, మిక్కిలినేని, గిరిజారాణి, అనిత, జయమాలిని పోషిస్తున్నారు. పీటూరి కథ, మాటలు వ్రాసిన ఈ చిత్రానికి రాఘవులు సంగీతాన్ని, యస్. యస్. లాల్ ఛాయాగ్రహణాన్ని సమకూరుస్తున్నారు.

'ఖైదీ కాళిదాసు'లో శోభన్



# సినిమా

## ఇంద్రలోకంలో ఎన్టీఆర్

దేవేంద్రుని సభాభవనం నిత్య నృత్య వైభవంతో విలసిల్లుతుంది అనేది నిజం అందరికీ తెలుసు.

ఇంద్రలోకంలో సురులు తప్ప అన్యులు వెళ్ళడానికి అనుమతి లేదు. కానీ, మన కథా నాయకుడు ఎన్టీఆర్‌గారు తన మహాత్మ్య మహిమతో దేవేంద్రుని సమీపించారు. అక్కడికి వెళ్ళి, వూరుకున్నారా?

దివ్యతేజస్సుతో భాసిల్లిన "రంభ... ఊర్వశి... మేనక"ల చేత అద్వితీయ నాట్యాన్ని చేయించారు.

"ఆడవే అందాల సురభామినీ
పాడవే కళలన్ని ఒకటేనని
గాన మేదైనా... స్వరము లొక్కటే
నాట్యమేదైనా... నడక ఒక్కటే"

అని పింగళి వ్రాసిన మధురగీతాన్ని, (బాలు... సుశీల పాడారు) ఎన్టీఆర్ ఆలాపించ, దేవతానర్తకులు తమ అభినయకౌశలంతో సభికులను ముగ్ధుల్నిచేశారు.

ఈ రసమయ శృంగార దృశ్యం శ్రీ పల్లవి ఫిలింస్ రంగుల్లో నిర్మిస్తున్న "యమగోల" చిత్రంలో స్పెషల్ అయిటమ్‌గా ప్రేక్షకులను ఆకర్షిస్తుంది. ఈ చిత్రానికి తాతినేని రామారావు గారు దర్శకుడు. (ఎన్టీఆర్...టి. ఆర్. ఆర్. కలిసి పని చేస్తున్న మొదటి చిత్రం.)

నిర్మాత ఎస్. వెంకటరత్నంగారు ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తున్న "యమగోల" చిత్రం జూలై షెడ్యూలుతో పూర్తవుతుంది. ఇటీవల ఈ చిత్రం తాలుకు అవుట్‌డోర్ షూటింగు చిత్తూరు పరిసర ప్రాంతాలలో జరిగింది.

వినోదం ... శృంగారం...సంగీతం సమపాళ్ళలో రంగరించుకున్న "యమగోల" వర్ణ చిత్రానికి శిల్ప వైభవాన్ని ఎస్. కృష్ణారావు, సంగీత వైభవాన్ని చక్రవర్తి, ఛాయాగ్రహణ వైభవాన్ని ఎస్. వెంకటరత్నం, రచనా వైభవాన్ని డి. వి. నరసరాజు సమకూరుస్తున్నారు. కూర్పు శాఖను సంజీవి నిర్వహిస్తున్నారు.

ఈ చిత్రంలో జయప్రద, సత్యనారాయణ, రావుగోపాలరావు, అల్లురామలింగయ్య, ఛాయాదేవి ముఖ్య పాత్రధారులు.

లక్ష్మి ఫిలింస్‌కు మరొక "జాక్‌పాట్" చిత్రం అవుతుంది, "యమగోల" చిత్రం.

"యమగోల" చిత్రంలోని ఆరు పాటలను విన్నవాళ్ళు, చక్రవర్తి సినిమా జీవితంలో యిన్ని హిట్స్ యిచ్చిన చిత్రం యిదేనేమో అని అభిప్రాయ పడ్డారు. ఆరు పాటలు హిట్ అవుతాయి అని అందరూ అంగీకరించారు.



'ఇదెక్కడి న్యాయం'లో జయమాలిని, మోహన్‌బాబు

## అనురాధాదేవి రెండో చిత్రం

"చక్రధారి" చిత్రాన్ని నిర్మించిన శ్రీమతి అనురాధాదేవి (లక్ష్మి ఫిలిం కంబైన్స్) తన రెండో చిత్రాన్ని జూలై మొదటిరోజున ప్రారంభిస్తుంది.

హిందీ చిత్రం "సమాధి" ఆధారంగా కొన్ని మార్పులతో తెలుగులో ముస్తాబవుతున్న యీ త్రిల్లర్‌కు, డైనమిక్ లాల్ దర్శకుడు గావడం శుభావహం.

శోభన్‌బాబు ద్విపాత్రాభినయం ప్రత్యేక ఆకర్షణగా వుండే యీ చిత్రంలో జయచిత్ర... దీప ... జయమాలిని ... జి. వరలక్ష్మి...గుమ్మడి... రాజబాబు ... రవికృష్ణ ముఖ్య పాత్రధారులు.

ఈ చిత్రానికి గొల్లపూడి రచన్ను ... సత్యం సంగీతాన్ని ... బాలకృష్ణ ఛాయాగ్రహణాన్ని, వాలి కళను, రామారావు ప్రొడక్షన్ను నిర్వహిస్తున్నారు. పూర్ణా పిక్చర్స్ విడుదల.

## ఎస్. డి. లాల్ కొత్త చిత్రం

హిట్ చిత్రాల దర్శకుడుగా ఎస్. డి. లాల్ గారికి పేరుంది. ఆయన రూపొందించే చిత్రాలలో "మాస్ అప్పీల్" అంశాలు యెక్కువ వుంటాయి గాబట్టే, మళ్ళీ మళ్ళీ జనం చూస్తారు.

లాల్ దర్శకత్వంలో సాకేత ఆర్ట్స్ అనేది నూతన సంస్థ ఒక వినూత్న ప్రయోగాన్ని తలపెట్టారు.

ఆగస్టు నుంచి ప్రారంభమయ్యే ఆ చిత్రానికి గొల్లపూడి రచన్ను, ఎస్. ఎస్. లాల్ ఛాయాగ్రహణాన్ని, రాజేశ్వరరావు సంగీతాన్ని నిర్వహిస్తారు.

సాకేత ఆర్ట్స్‌ను స్థాపించిన వ్యక్తి పేరు పాండురంగయ్య. ఒక సంస్థానంలో మంచితనాన్ని... పలుకుబడిని సంపాదించుకున్న వ్యక్తి.

శ్రీనివాస



'గడుసు అమ్మాయి'లో ఒక దృశ్యం



మల్లాది వెంకటకృష్ణమూర్తి

(గత సంచిక తరువాయి)

"**యో**గిగారిని చూసి ఏం మాట్లాడతావే అలివేణీ ?" అడిగేను

యోగిగారు ముఖం చూసి ముందుకేం జరుగుతుందో చెప్పగలరుట — బైరాగిగారూ... నిజమే కదూ ?"

"మీకేమిటి తెలుసుకోవాలని వుందమ్మా ?" బైరాగి అడిగేడు.

అలివేణి తడుముకోకుండా చెప్పింది. "నా పెళ్లి గురించి — నా పేరు అలివేణి... అలివేలు అని అమ్మ పేరు పెడతానంది... నాన్నేమో నీలవేణీ అని పెడతామన్నారు... ఇద్దరూ కలిసి అలివేణి అని పెట్టేరు. ఈ అమ్మాయి పేరు అనసూయ. మా పెళ్లి గురించి మావాళ్లు ఆలోచించని క్షణం లేదు. వాళ్లకి మా బెడద తప్పుతుందా లేదా ? మా పెళ్లిళ్ళు త్వరలో అవుతాయా ? ఎటువంటి యిళ్లకి వెళ్తాం ? ఇవే మేం అడగదలచుకున్నది. యోగిగారి మాటకి తిరుగులేదుట ?"

నేను బిక్కచచ్చిపోయేను. అలివేణికి పెళ్లి మీదకి ధ్యాస వెళ్లిపోయిందన్న మాట— పిల్లమ్మేమో యిప్పట్నించీ కూతురుకి పెళ్లెందుకంటోంది. ఈ బైరాగి ఏమనుకుంటాడు ? ఒక కన్నెపిల్ల వచ్చి, ఇంత సిగ్గు లేకుండా తన పెళ్లి ఎప్పుడవుతుందని అడుగుతే ఎంత బైరాగికన్నా ఎబ్బెట్టుగానే వుంటుంది. నాకూ అదే కోరిక వున్నట్టు చెప్పింది — నాగురించి ఏమనుకుంటాడు ? పోబోతున్న నన్ను అలివేణి ఆపింది — "ఆగే... ఎక్కడికి వెళ్లిపోతున్నావ్ ? అలా సిగ్గుపడవల్సినదేముందిందులో ? యోగిగారు దేవుడువంటివారు."

బైరాగి తల ఎత్తి అలివేణి కళ్లలోకి... సిగ్గుపడుతున్న నా కళ్లలోకీ చూసేడు. పని ఆపి, లేచి నిల్చొని... "రండి లోపుకి — యోగిగార్ని చూద్దురు గాని" అంటూ పర్ణశాలలా వున్న కుటీరంవేపు వెళ్లేడు. పిల్లల్ని పంపించేసి మేం యిద్దరం అతని వెంట వెళ్లేం. ఒక కుటీరంలోకి వెళ్లేం — రెండు చిన్న గదులు - కిందని దర్భ పుల్లలతో అల్లిన చాపలున్నాయి — ఒక మూలకి కుండతో నీళ్లు... కొన్ని కాషాయబట్టలు తప్పించి మరేమీ లేవు. యోగిగారెక్కడా కనిపించలేదు.

"మీరు ఆ చాపమీద కూర్చోండి." అని చెప్పి అతను రెండో గదిలోకి వెళ్లేడు. కొంత సమయం తరవాత అతను వచ్చేడు ఒంటిమీద కాషాయ రంగు కమీజు తొడుక్కొని.

"యోగిగారు లేరా?" అని అడిగింది అలివేణి.

'నేనే ఆ యోగిని' అన్నాడతను నవ్వుతూ — యిద్దరమూ లేచి నిలబడ్డాం ఆశ్చర్యపోతూ, సిగ్గుపడుతూ.

"మీరా ! ఏదో అనిసేం... క్షమించాలి !" అన్నాను నేను.

"మీరేమీ అనలేదు — కూర్చోండి. అందరూ వనభోజనానికొచ్చేరా? మంచిది — ఎప్పుడూ యింటికే కట్టిపడేసినట్టుండకుండా. ఆడవాళ్లంతా కలిసి-యిలా ప్రకృతిలోకి రావడం సంతోషించదగ్గ సంగతి. ప్రకృతిలో భాగమే స్త్రీ. అప్పుడప్పుడిలా తన పుట్టినింటికి వస్తూవుండాలి ఆడది..." చిరునవ్వు నవ్వుతూ అన్నారు.

అతన్ని చూస్తూవుంటే నా మనసులోంచి మాటలు వచ్చేసేయి... "ఈ సంసారంలో దుఃఖం తప్ప నాకు మరేమీ కనిపించలేదు — దుఃఖం ఎలా పోతుంది ?"

'ప్రాపంచిక వస్తువులమీద కోరికలు తగ్గించుకుంటే దుఃఖమూ తగ్గుతుంది — కొన్ని నిత్యావసరాలుంటాయి. అవి లేకపోతే మనిషి బతకలేడు. అవి కావాలనుకోటం కోరికలు కావు. కాని వాటిని ఎంచుకోటంతోనే ఎక్కువ తక్కువలొస్తున్నాయి. పూరిగుడిసెవాడు పెంకుటిల్లుకోసం, అదొచ్చేక మేడ కావాలనీ... నూలు చీరలు కాక సిల్కు చీరలు కావాలనీ... బంగారం నగలూ కావాలనీ... వున్నవన్నీ యిలా వుండిపోవాలనీ... మనకేకాక మన సంతతికి కూడా చాలినంత కూడపెట్టాలనీ తాపత్రయం — వున్నది చాలక యింకా కావాలని కాని పనులు చెయ్యడం. ఈ కోరికలన్నీ దుఃఖహేతువులు. డబ్బున్నవాడికి దుఃఖం లేదనుకుంటే నువ్వు పొరపాటుపడుతున్నావు నీకు చాలినంత డబ్బు లేకపోవటంవల్ల రెండు పూటలా పంచ భక్ష్యాలతో తిండీ, అందమైన బట్టలూ లేకపోవచ్చు - నీ దుఃఖం అంతేనని సంతోషించు. ధనవంతుడిని అడుగు... 'అయ్యా ? మీకింత డబ్బుందికదా ? మీకు దుఃఖం లేకుండా శాంతి వుందా' అని, అతడేం చెప్తాడో విను — అప్పుడు తెలుస్తుంది అతను సంసారమనే వెలుగుబంటి బంధంలో ఎలా చిక్కుకున్నాడో — అలా అని సంసారం వదిలిపొమ్మనడం లేదు నేను. అందులో వుంటూనే, నీ జీవికకి కావల్సిన కనీస అవసరాలనే కోరుకొని, అవి దొరికేక మరెక్కువ ఆశించక, ఎక్కువ వుండేదానిని తక్కిన నీకన్నా నిర్భాగ్యులకోసం వినియోగించి, నీ బాగే కాకుండా, నీ ఎదుటింటివాడి బాగు కోరుకుంటే, దుఃఖం దానంత అదే పోతుంది. ఈ ప్రపంచంలో ప్రతి ఒక్కడూ అలా వుంటే ఈ ప్రపంచం ఎంతో శాంతిమయమైన లోకమవుతుంది."

అలివేణికీ మాటలు తలకెక్కలేదు. నాకు కొద్దిగా అర్థమయింది. "కాని అందరూ అలా వుండరు కదా స్వామీ ? మహాపురుషులే పరివర్తన తేలేకపోయేరు. అందరూ అలా అయ్యేవరకూ నా దుఃఖం పోదంటారా ?"

'అందరూ అలా అయ్యేవరకూ నీ దుఃఖం నీతో వుండిపోదు — నువ్వు అలా వుండగలుగుతే నీమట్టుకి చాలు — నీ జీవితం మరొకరికి తప్పకుండా వెలుగు చూపుతుంది. మరొక సంగతి — సంతోషం. దుఃఖం అన్నవి ఏమిటమ్మా ? ఈ శరీరం ద్వారా మనసుకు కొన్ని కోరికలు తీరలేదనికాని, మనసుకీ శరీరానికీ తమకీ భద్రత లేదన్న భయం కలిగినప్పుడు కాని, ఒక మనసుకు మరొక మనసుతో కలిగిన బంధం విడిపోయినప్పుడుకాని, కలిగిన అనుభూతి దుఃఖం, మనఃక్లేశం. దానికి వ్యతిరేకభావమే సుఖం. రెండూకూడా మనసుయొక్క భావాలే. రెండూ అశాశ్వితాలే. క్షణికాలే. సుఖాన్ని కాంక్షిస్తూ అది దొరకడంలేదని దుఃఖిస్తావు కాని దుఃఖాన్ని కాంక్షిస్తూ, అది రాలేదని ఎప్పుడన్నా సుఖించేవా ? అలా ప్రయత్నించిచూడు ! నీ ఆలోచనలలో మార్పొస్తుంది. సుఖదుఃఖాలు మనసు నీలో కలిగించే భావ సంచలనాలు — శరీరం, మనస్సూ, బుద్ధీ నీయొక్క అంగాలు. నువ్వు శరీరానివీ కావు, నువ్వు మనసువి కావు, నువ్వు బుద్ధివీ కావు — అవి నీ అధీనంలో వున్న వస్తువులు - వాటిని అధీనంలో వుంచుకోలేనివాడు, వాటికి బానిస అయినవాడూ దుఃఖించక తప్పదు."

నాకూ పూర్తిగా అర్థంకాలేదు కోరికలు తగ్గించుకుంటే దుఃఖం తగ్గుతుందన్న సంగతి అర్థమయింది. కాని సుగుణలాంటి స్త్రీలు తమకి కోరికలు లేకపోయినా, కోరికలు వున్నవారికి బలి

**జరిగిన కథ-10 :** అనసూయ అక్కకీ, అన్నకీ పెళ్లయిపోతుంది. తండ్రి వుద్యోగంనుంచి రిటైరైపోతాడు. ఆర్థిక బాధలు మనుషుల్ని ఎలా మార్చేస్తాయో అనిపిస్తుంది అనసూయకి అన్నని చూస్తుంటే. అనసూయ పెళ్లి ఆ యింట్లోవారికి ఓ సమస్య. ఎస్.ఎస్.సి. పాసయిన అనసూయ చదువు ఆగిపోతుంది ఆర్థిక యిబ్బందులవల్ల. ఆడపిల్లలకి చదువనూ, వ్రాయనూ నేర్పించటానికి బడి పెడ్తారు అనసూయా కనకదుర్గ. చిన్నతనంలోనే వైధవ్యం పొందిన స్నేహితురాలు నిర్మల చేత మెట్రిక్‌కు కట్టిస్తుంది అనసూయ. భర్త వదిలేసిన సుగుణతో పరిచయమవుతుంది అనసూయకి. తన జీవితంగురించి అనసూయకు చెప్పటం మొదలెడ్తుంది సుగుణ. సుగుణ అక్క సంధ్య. రంగారావ్‌ను ప్రేమించిన సంధ్య అతడ్ని నమ్మి తన శీలాన్ని అర్పిస్తుంది. నువ్వునాకు జీవితాంతం ఉంపుడుకత్తెగా వుంటానంటేనే నీ అక్కను పెళ్లాడతానంటాడు రంగారావ్ సుగుణతో. తను కోరినట్లు శీలం పోగొట్టుకోటానికి సుగుణ అంగీకరించకపోవటంతో సంధ్యకి పన్నవకుమార్ అనే అతనికీ అక్రమసంబంధం సృష్టిస్తాడు రంగారావ్. రంగారావ్ వేసుకున్న పథకం ప్రకారం సుగుణకి అతనితో పెళ్లవుతుంది. సుగుణ తనని మోసం చేస్తుందేమోనన్న అనుమానంతో ఆమెని మానసికంగా శారీరకంగా హింసించటం ప్రారంభిస్తాడు రంగారావ్. సంధ్యని పెళ్లాడిన రంగారావ్ నిన్ను పెళ్లాడిన రంగారావ్ నేను కాదంటాడు సుగుణతో.

అయిపోతున్నారే ? దాని సంగతేమిటి ? ఆ ప్రశ్న వేస్తే ఆయన జవాబిస్తారు. కాని ఆ జవాబు నా కర్థంకాదు.

అలివేణి అడిగింది. "పెళ్లి... సంసారం యివికూడా కోరుకోరాదా? అందరూ సన్యసించాలా?"

"మనిషి సంసారంలో వుంటూనే యోగిలా వుండొచ్చు కష్టాలకి కుంగక, సుఖాలకి పొంగక వుండగలగటం నేర్చుకోవాలి. అహంకారం, గర్వం తగ్గాలి. అణకువ, సౌమ్యత, దయ, జాలి... ఈ గుణాలు పెంచుకోవాలి."

నేనూ అలివేణీ అతని పాదాలని నమస్కరించేం. అలివేణికేసి చూసి అతడన్నాడు. "నాకు ముందేం జరుగుతుందో చెప్పడం రాదు — మహిమలేవీ నాదగ్గర లేవు. కాని ఒక సంగతి విను — తొందరపడి ఏ పనీ చెయ్యకు. నీ తల్లినించి ఏ సంగతీ దాచకు. అంతే నీకు నేను చెప్పగలిగేది."

అలివేణి ముఖం పాలిపోయింది. తేరుకొని అంది. "అలాసే స్వామీ!"

నన్ను చూసి అన్నారు. "నీది స్వచ్ఛమయిన మనస్సు, వెన్నలా మెత్తనయిన హృదయం — దేవుడే నీ బాగోగులు చూసుకుంటాడు. ఏ విచారమూ పెట్టుకోకు!"

చెయ్యెత్తి యిద్దరినీ దీవించేరాయన. ఆ రెండు వాక్యాలకీ నా ఒళ్లు పులకరించింది. మహాత్ముల దగ్గర్నించి అంతకన్న కావల్సిన నిధి ఏమిటి ?

నేనూ అలివేణీ తిరిగివచ్చేం. ఉప్మా తయారయింది — కాఫీనీళ్లు మరుగుతున్నాయి. కర్రలు కొడుతున్నారు కూలివాళ్లు.

"నేనూ అనసూయా యోగిగారిని చూసి వచ్చేం" అలివేణి సంబరపడుతూ చెప్పింది. జరిగిన వైనమంతా చెప్పింది.

"నేనూ చూసివస్తాను తరవాత." దుర్గపిన్ని అంది — "వంటలయ్యేక నైవేద్యం అతనికిచ్చి వద్దాం. ఆయన ముట్టుకున్నాక అది ప్రసాదంకింద తిందాం."

"వారిని వందుకోవద్దని చెప్పిరావద్దా ?"

"సుగుణ వెళ్లి చెప్పివస్తుంది—ఏం సుగుణా?"

"నేనూ నిర్మలా వెళ్లివస్తాం..." అంది సుగుణ. ఇద్దరూ లేచి ఆశ్రమంవేపు వెళ్లేరు.

నేను విస్తర్లు చింపి పిల్లల్ని పిలిచేను అందరినీ వరసగా కూర్చోపెట్టి ఉప్మా వడ్డించేను. దానికితోడుగా అరిటిపళ్లు రెండేసి. తరవాత అందరికీ గ్లాసులలో కాఫీపోసి యిచ్చేను. అది తాగేక యెవరి మానాన వాళ్లు ఆడుకుందుకి వెళిపోయేరు.

సుగుణా, నిర్మలా వెళ్లిన ఒక గంట తరవాత వచ్చేరు. ఇద్దరి ముఖాలూ ప్రఫుల్లంగా వున్నాయి. యోగిగారు వాళ్లతోకూడా మాట్లాడినట్టుంది యెంతోసేపు. వారి కళ్లు చెమ్మగిల్లికూడా వున్నాయి.

"ఎందుకే ఏడుస్తున్నారు ?" అడిగింది పిన్ని.

"మమ్మల్నిద్దర్నీ దీవించేరు." నిర్మల సంతోషంగా అంది.

"నైవేద్యం గురించి ఏమన్నారు ?"

"శాకాహారం అయినంతవరకూ అతనికి అభ్యంతరంలేదు."

"అంతసేపేం చేసేరు ?"

"నిర్మల సంగతీ, నా సంగతీ విని విచారించేరు. కష్టాలని యెలా ఎదుర్కోవాలో చెప్పేరు. త్వరలోనే మాకు మంచి జరుగుతుందని చెప్పేరు." సంబర పడుతూ అంది నిర్మల

"నువ్వు మెట్రిక్ పాసవుతావు. సుగుణ బి. ఏ. పాసవుతుంది. అదే మంచి." దుర్గపిన్ని చెప్పింది. మేం టిఫిను తిన్నాక పిల్లలచేత ఆటలాడించమంది వదిన. అందుకు నేనూ, సుగుణా, అలివేణీ, పిల్లల్ని తీసుకొని నడుచుకుంటూ తోట దాటి వెళ్లేం. కొంతదూరం వెళ్లేక యెండిపోయిన వాగు ఒకటుంది. ఇసక మెత్తగా వుంది యిదివరకు నీరు పారినచోట. అక్కడ పిల్లలచేత కొన్ని ఆటలు ఆడించేం. వారిమట్టుకు వారు ఆటల్లో పడ్డారు కొంతసేపయ్యేక.

"యోగిగారు చెప్పినది నిజంగా జరుగుతుందా అనసూయా ?" సుగుణ అడిగింది.

"ఏం చెప్పేరేమిటి, అంత నమ్మకపోడానికి?" అలివేణి అడిగింది.

"ఆయన నన్ను వెతుక్కుంటూ తిరిగివచ్చి తీరతారని అన్నారు..." ముఖంలో ఆనందంతో అంది.

నాకు ఆశ్చర్యం వేసింది. అతడు తిరిగి రావాలని కోరుకుంటోందా సుగుణ ? "అతను తిరిగివస్తే నువ్వు రానిస్తావా అక్కా ?" అడిగేను నేను.

'అతనింటికి అతనొస్తే నేను రావద్దనగలనే? వెళ్లి నాలుగేళ్ళయింది—నెలనెలా డబ్బు పంపడంతప్ప నాలుగు ముక్కల ఉత్తరమన్నా రాయలేదు."

"అటువంటి మనిషి తిరిగివస్తే నీకు సుఖమెక్కడక్కా ?"

"ఔనమ్మా ... మవ న్నది నిజమే — కాని



నా గాథ యెప్పుడూ అడుగుతూవుంటుంది ... నాన్న యెవరమ్మా ... ఒక్కసారి నాన్నని చూసివద్దామా అని. అలా అది అన్నప్పుడు, నా మనస్సు తరుక్కుపోతుందనుకో. అదింకా పెద్దదయినప్పుడు, దానిని తండ్రి వదిలిపెట్టిన పిల్లగా అందరూ చూసినప్పుడు ఏం బాధపడుతుందో అని నా భయం. అంతేతప్ప నా ఆనందంకోసం కాదనసూయా అతడి రాకని కోరుకుంటున్నది...'' కళ్ళు చెమ్మగిల్లగా దూరంగా చూస్తూ అంది సుగుణ.

''అదీ నిజమే. కాని ఒక సంగతి చెప్పక్కా ! నువ్వే అతడు చేసిన పొరపాటు చేసివుంటే, తిరిగి నువ్వు వెళ్తే అతడు రానిస్తాడా ?''

సుగుణ నవ్వింది — ''ఎందుకే అనసూయా అంతలా ఆవేశపడతావు ? మనం అటువంటి పని చెయ్యడమూ, బతికివుండడమూనా ? అదెప్పుడన్నా జరుగుతుందా ?''

అలివేణి ఇసుకతో గూడులు కడుతోంది అడుగున ఇసుక తడిగా వుంది. అలివేణి అంది ... ''ఇలా పిచ్చుకగూళ్ళు కట్టుకుంటూ ఆడుకోవాలని వుంటుందే నాకెప్పుడూ...''

''నువ్విక్కడే వుండిపో — మేం అంతా వెళిపోతాం.'' నే అన్నాను.

''నన్ను పిచ్చిదానివని అంటారు. ఇక్కడుండిపోతే భోజనం యెవడు పెడతాడు ?''

''నీకిన్ని తెలివితేటలున్నాయికదా, చదువుకోరాదుటే అలివేణీ ?'' సుగుణ అంది.

''నా కెందుకక్కా చదువు ? ఇంగ్లీషు, లెక్కలూ ... అసలే రావు — కాలక్షేపానికి ఏవో నవలలు, వారపత్రికలూ చదువుతున్నాను. అది చాలు. నాకు బతుకులోని పాఠాలు నేర్చుకోవాలని వుందక్కా.''

''ఒద్దొద్దు ! బతుకులోని పాఠాలుమాత్రం నేర్చుకోకు. నీకెవరే చెప్పేరా మాటలు ?''

''అదేదో సీరియల్‌లో చదివేను. ఆనందంగా బతకాలనుకోడం తప్పా ?''

''అలా అనడంలేదు నువ్వు. పాఠాలు నేర్చుకోవాలంటున్నావ్. నిప్పుని ముట్టుకుంటే చెయ్యి కాలుతుంది. అది బతుకులోని పాఠం. నిప్పు కాలుతుందని, నిప్పుని ముట్టుకోకుండానే తెలుసుకోవచ్చే. ఆనందంగా బతకడం అన్నావు. అది వేరే సంగతి నీ ఉద్దేశంలో ఆనందంగా బతకటం అంటే ఏమిటి ?''

గూడు చుట్టూ గోడ కడుతూ చెప్పింది అలివేణి — ''నా జీవితంలో నేను అనుకోని గొప్ప సంగతేదో జరుగుతుందని నాకు ప్రతి క్షణం అనిపిస్తూనే వుంటుంది. అది నాకే జరుగుతుందని పిస్తుంది. ఇప్పుడు యీడుస్తున్న బతుకుమీదా, అమ్మమీదా, నే వుంటున్న ఇంటిమీదా విసుగుపుట్టి, యివన్నీ వదిలేసి మరో జీవితం ఆరంభించాలని వుంటుంది...''

''అది నీలోని ఉత్సాహం, నీలోని వయసు నీమీద చూపే ప్రభావం. ఉరకలువేస్తూ ముందుకు పోవాలని వుంటుంది. ముందేముందో చూడాలని వుండదు. ఉరకలు వేసేందుకు అవకాశం లేకపోతే అందరిమీదా విసుగు పుడుతుంది.'' సుగుణ చెప్పింది.

''ముందుకేముందో చూసుకుంటూ వెళ్తే దౌడుతియ్యలేవు.''

''పరుగెందుకు ?''

''నీకూ అలా అనిపించదా అనసూయా ?'' అలివేణి అలవోకగా చూస్తూ అడిగింది.

'ఎందుకనిపించదు? ప్రతిక్షణం అనిపిస్తూనే వుంటుంది. కాని మనసుతో పరుగులూ, ఉత్సాహంతో ఉరకలూవేస్తే నే వెళ్ళే దెక్కడికి ? తెలియక ఆగిపోతాను. ఎన్నో అడ్డు కనిస్తాయి. పరిస్థితులు — నా దగ్గరివాళ్ళ అభిప్రాయాలు — నే నుంటున్న సంఘం, మంచీచెడుల విచక్షణ, స్త్రీని అవడంవల్ల కలిగిన అబలత. అనిపిస్తుందే — అలా ఉరకలువేసే మనసువెంట పరుగులుతియ్యడం కష్టమైన పనే. కాళ్ళు విరుగుతాయి !''

అలివేణి గలగలా నవ్వింది. ఆ ఇసుకలోని జల వచ్చి పారినట్టుగా అనిపించింది.

''నువ్వు తెలివైనదానివే అనసూయా ! నాకా తెలివితేటలు లేవు. నేను శుద్ధమొద్దుని. మనసెలా చెప్తే అలా వింటాను...''

''మనసు రెక్కలులేకుండా యెగురుతుంది. కాళ్ళులేకుండా పరుగుతీస్తుంది — కాంతికన్న వేగంగా ప్రయాణిస్తుంది. క్షణ క్షణానికీ మారిపోతుంది. 'నిన్న నువ్వు అలా చెప్పేవ్ — నీకోసం నేనా పని చేసేను. చూడు దాని ఫలితం !' అని మనసుని నువ్వడుగుతే, 'నిన్న అలా అన్నాను కాని యివాళ అలా చెప్పను. ఇవాళవరకూ ఆగవల్సింది నువ్వు !' అంటుంది మనసు. అందుకే మనలో బుద్ధి అన్న దొకటుంది. మనసు అన్నది సరైనదా కాదా, దాని కోరికలు తీర్చడం మంచిదా కాదా అని ఆలోచిస్తుంది. బుద్ధిని వాడడం మన కెంతయినా అవసరం.'' సుగుణ ఆలోచిస్తూ అంది.

''ఇప్పుడు గోతిలోనే వున్నాను. ఎవరన్నా ఊతనిస్తారా అని చూస్తున్నాను.'' అలివేణి అంది.

''అంటే ఏం జరిగింది ?'' ఆత్రంగా అడిగింది సుగుణ.

''ఏమీ జరగలేదు. నేను ఉంటున్న గది, ఇల్లు ... ఆ చిట్టెమ్మ ... మా అమ్మ ... డబ్బులేని బతుకు ... ప్రతి పైసాని ఖర్చుచేసేముందు పదిసార్లు ఆలోచించడం ... యిటువంటి యీ ఇరుకు బతుకంటేనే నా కసహ్యం ! నూతిలోని కప్పలా బతకడం...' అలివేణి చిరాకుగా లేచి, కాలితో పిచ్చికగూటిని తన్నిసింది. ''ఆ పక్షులలా హాయిగా ఎగిరిపోవాలే అనూ...'' అలివేణి మత్తుగా చూస్తూ అంది.

సుగుణ నాకేసి అర్థవంతంగా చూసింది. సుగుణ చూపుల అర్థం నాకు తెలుసు. అలివేణికిప్పుడు కలుగుతున్న మానసిక ఆనందం ఒకప్పుడు తనకూ కలిగేదనీ, తనలో కలిగిన ఆనందాన్ని, ఇతరులు తమ స్వార్థంకోసం వాడుకున్నారనీ, ఆ భావం కలగడంవల్ల కన్యకి నష్టమేతప్ప లాభం లేదనీ. అలివేణి పైకి అనిసింది. నేను అనలేదు. నూతిలోని కప్ప సామ్యం యెక్కడ చదివిందోకాని సరిగ్గా మా జీవితాలు అలానే వున్నాయి.

చుట్టూ యెత్తయిన గోడలు — నుయ్యి ఎండిపోయింది. బైటకు వెళ్లే మార్గంలేదు - ఎగిరే శక్తిలేదు. ఆడదాని జీవితం యెక్కడయినా అంతేనా ?

నూతి గోడ యొక్క ఒక్కొక్క ఇటుకా ఒక్కొక్క అడ్డు. ఆ ఇటికలు యెన్నో వున్నాయి.

మొదటి ఇటుక — మగాళ్ల మనసులో ఆడదంటే వున్న చులకనభావం. రెండవ ఇటుక ఆడది విలాస వస్తువన్న భావం — ఆడది పొరపాటుచేస్తే అది క్షమించరాని నేరం అన్నది మరొక ఇటుక. స్త్రీ శీలం అతి విలువైనది. అది పోగొట్టుకున్న ఆడది దానిని తిరిగి పొందలేదు అని అంటూనే ఆమె శీలాన్ని దోచుకుందుకి ప్రపంచంలోని ప్రతి పురుషుడూ చేసే ప్రయత్నం ఒక ఇటుక. ఆడది పెళ్లి కాకుండా పరపురుషుడి ముఖం చూడకూడదంటూ, స్త్రీ శీలం సమాజపు నైతిక శక్తికి ముఖ్యం అంటూ, ఆమె పెళ్లికి యెన్ని అడ్డుగోడలున్నాయో అన్నీ పెట్టడం కొన్ని ఇటుకలు కులం, మతం, శాఖాబేధం, వర్ణబేధం, చదువులో ఎంపిక, అందంలో ఎంపిక, హోదాలో ఎంపిక,



ఉత్తర అమెరికాలో మొదటిసారిగా జరిగిన తెలుగు సభలలో
బుర్రకథ చెపుతున్న వంగూరి రాజు, దువ్వూరి సూరి, అనిల్ కుమార్‌లు.

# ఒక కన్య చెప్పిన కథ

కట్నంలో ఎంపిక – ఇవన్నీ ఒక్కొక్క ఇటికా ప్రశ్నకి. ఆ అడ్డు ఏమీ యెందుకుండవు మగాడికి? మగాడి విచ్చలవిడితనాన్ని సమాజం ఎందుకు క్షమిస్తోంది? ఆ విచ్చలవిడితనానికి యెందరు స్త్రీలు యెరలవుతున్నారో యెవ్వరూ యెందుకు గ్రహించరు? స్వతంత్రంగా తన కాళ్లమీద నిలబడదాం అనుకున్న సుగుణకి యెన్నో అడ్డు

"పదండి ... పోదాం!" అన్నాను లేస్తూ.

వంటలు అయ్యేసరికి పన్నెండు దాటింది. పెద్ద, బూరెలు, రెండు కూరలు, పులుసు, పప్పూ యివన్నీ తయారయ్యేయి. వండిన వంటలలో నలుగురైదుగురికి సరిపోయే భాగాన్ని పెట్టి, దుర్గ పిన్నీ, వదినా, రుక్మిణీ యోగిగారి ఆశ్రమానికి తీసుకువెళ్లేరు. వాళ్ళు తిరిగి వచ్చేసరికి ఒంటిగంట దాటింది. తీసుకువెళ్లినదానిలో చాలా తక్కువ వుంచుకొని తక్కినది ప్రసాదంకింద ఇచ్చేసేరు యోగిగారు.

పిల్లలకి ముందు పెట్టి, తరవాత మేం తిన్నాం. అందరి భోజనాలూ అయ్యేసరికి మూడయింది – గిన్నెలు కడిగించి ఐదుకల్లా తిరిగి యింటికి బయల్దేరేం. బయల్దేరేముందు ఆ పరిసరాలని మరొక్కసారి చూసేను. మళ్ళా యెన్నాళ్ళకో యిలా రావడం? ఇక్కడికి మరి వస్తానో రానో ... ఒకవేళ వచ్చినా ఆ వచ్చినకాలానికి యివాళ వచ్చినవారిలో ఎంతమందిమి వుంటామో?

అలివేణి నన్ను ఆపింది కనుసన్న చేసి. తక్కినవాళ్ళు ముందుకు సాగిపోయేరు. వదిన వెనుదిరిగి కేకవేసింది – "ఏమే? ఆగిపోయేరు? రండి ... చీకటిపడిపోతోంది." అలివేణి– "నడవండి... మేం వచ్చేస్తున్నాం నిముషంలో..." వాళ్లు ముందు కెళ్లేరు.

మామిడితోట మధ్యని నిల్చున్నాం. పిల్లలు దూరమయ్యేరు.

"ఏం అలివేణీ? యెందుకు ఆగమన్నావ్?"

"నా మనస్సులో వున్న ఒక సంగతి, ఎవ్వరికీ చెప్పని సంగతి నీకు చెప్పాలనివుంది అనసూయా! యెవ్వరికీ యీ సంగతి నువ్వు చెప్పకూడదు. నాకు మాట ఇయ్యి." నా రెండు చేతులూ పట్టుకుంది.

"ఆ సంగతేమిటో తెలుసుకోకుండా ఆమాట యెలా ఇస్తానే?"

"అలా అయితే తెలుసుకున్నాక అందరికీ చెప్పేస్తావా?"

"అంత చెప్పకూడని సంగతి నాకెందుకే చెప్పటం?"

"అనూ! ఇవాళ యీ క్షణం ... యీ పక్షుల మధ్య...యీ చెట్లమధ్య...యీ నీలిఆకాశంమీద... నా స్నేహితురాలివైన నీ చెయ్యి పట్టుకొని ఎలుగెత్తి అరవాలనివుందే ఆ మాట..."

"అందరూ వినరా?"

"ప్రకృతి వినాలి ... పక్షులు వినాలి – నువ్వు వినాలి."

"చెప్పు! ఏం చెప్తావో వేగం ... యెవరికీ చెప్పన్లే!"

అలివేణి నా రెండు చేతులూ గట్టిగా పట్టుకుంది– అస్తమిస్తున్న సూర్యుడివేపు తిరిగింది. తల వెనక్కి విసిరింది. ఆకాశంలోకి తన్మయత్వంతో చూస్తూ అంది:

"విను అనసూయా! వినండి పక్షులారా! వినండి చెట్లూ... వినండి భూమీ! ఆకాశం! అందరూ వినండి!"

అలివేణికి మతికాని పోయిందా అనుకున్నాను.

"వినండి అందరూ... నేను" (ఆగింది) "నేను ప్రేమిస్తున్నాను! నేను ప్రేమిస్తున్నాను! నేను ప్రేమిస్తున్నాను." ఆ మాటలు మూడుసార్లని, నా భుజాలు గట్టిగా పట్టుకొని, నా నుదుటిని ముద్దు పెట్టుకుంది.

అదిరిపడ్డాను. ఏమిటి ప్రేమిస్తోంది? దేనిని ప్రేమిస్తోంది? ఎవరిని ప్రేమిస్తోంది – దీనికి నిజంగా మతిపోయింది.

"ఏమిటే నీ వాగుడు? ప్రేమించడం ఏమిటి?"

"ఔనే అనూ... నేను ప్రేమిస్తున్నాను." ఆమె కళ్లు ఆనందంతో చెమ్మగిల్లేయి.

"ఎవర్ని?"

జవాబుగా జాకెట్టులో జాగ్రత్తగా దాచుకున్న ఒక చిన్న కాగితం తీసి నాకిచ్చింది. చిన్న కాగితం అది – దానిమీద ఏమీ రాసిలేదు. దానిమీద రెండు పేర్లు ఎర్ర సిరాతో వున్నాయి – ఒక పేరు అలివేణిది – మరొక పేరు రవీంద్రది"

"ఏమిటీ పేర్లు?"

"అవి పేర్లు కావే, సంతకాలు."

"అంటే?"

"అర్థం కాలేదే పిచ్చిదానా? అది అంతే!"

"ఈ రవీంద్ర ఎవరు?"

"నా వెలుగు!"

"నీ వెలుగా?"

"ఔను. నా బతుక్కి వెలుగు – రవీంద్ర లేని జీవితం చీకటే నాకు."

"అబ్బాయా?"

పకపకా నవ్వింది. "అమ్మాయని ఎలా అనుకున్నావే మొద్దూ! నేను అతన్ని ప్రేమిస్తున్నానే!"

"మీ ఇద్దరూ ఒకరికొకరు తెలుసునా?"

"తెలీకపోతే యిద్దరం కాగితంమ్మీద ఎలా సంతకం పెట్టేం?"

"ఎందుకు పెట్టేరు?"

"అది ప్రతిజ్ఞ–ఒకరినొకరం బతికున్నన్నాళ్లూ వదలమని. అది రక్తంతో చేసిన సంతకాలే."

"రక్తంతోనా?!"

"ఔను – బొటనవేలు బ్లేడుతో గంటుపెట్టి, రక్తంలో కలం ముంచి సంతకాలు పెట్టేం – అతనో కాగితం వుంచుకున్నాడు."

"ఎవడా రవీంద్ర? నాకు చెప్పు. ఇలాటి వాటిలో తొందరపడడం మంచిది కాదు."

"రవీంద్ర నా వెలుగు – అంతకన్నా యివాళ చెప్పను. పద పోదాం–" ఆ కాగితం దాచి, నా చెయ్యి పట్టుక పరుగుతీసింది.

"వేణీ! తొందరపడకు. మీ అమ్మకంతా చెప్పు!"

"సమయం వచ్చినప్పుడు చెప్తాను. ఇప్పుడుకాదు. ఎవరితోనన్నా చెప్పేవా ... నా చావుకి నువ్వే కారణం అవతావు! గుర్తుంచుకో!"

ఆమెతో పరుగుతియ్యలేక ఆగిపోయేను.

ప్రేమిస్తోందా అలివేణి! ప్రేమ అంత శక్తి నిస్తుందా? అంత ఆనందం యిస్తుందా? మనిషిలో అంత సంచలనం కలిగిస్తుందా? ప్రకృతిలోని భాగమైనట్టు తన్మయత్వం పొందడం యెంత ఉదాత్తమైన భావన!

## 14

రవీంద్ర యెవరో నాకు వెంటనే చెప్పలేదు అలివేణి. ఆ మనిషిని యెక్కడ చూసింది, యెలా మాట్లాడింది, యెలా ప్రేమించింది యెవరికీ తెలియకుండా? రోజూ నేను యెంతోమంది యువకులని చూస్తూవుంటాను. సినిమాహాళ్ల దగ్గరా, రోడ్లమీదా, మా ఇంటిముందూ. కాని, ఏ ప్రత్యేకమైన యువకుణ్ణీ చూసి, ఇష్టపడి, మాట్లాడి, ప్రేమించటం అంటూ జరగలేదు. నావేపు, నా పరిచయం చేసుకోవాలన్న దృష్టితో యెవ్వరూ చూడలేదనికాదు. నేను స్కూలుకి వెళ్లేటప్పుడూ, వచ్చేటప్పుడూ, నా పద్నాలుగోయేడు దాటేక, ఎన్నో చూపులు వెంబడించేవి. అందమైన స్త్రీ రోడ్డంట పోతూవుంటే ఎవర్ని ఆకర్షించదు?

ఇప్పుడన్నా, రోడ్డుమీద వెళ్తూవుంటే, అది కాలేజి టయిమయితే, నావెంట కొన్ని సైకిళ్ళు వస్తూవుంటాయి మెల్లిగా. తమ మనసులోని కొంటెతనాన్ని వంకరటింకర భావాలతో తెలియజేయడానికి వారిలో వారు మాట్లాడుకుంటూ వెనక వస్తూవుంటారు. తల వంచుకొని నా మానాన్న నేను పోతాను. ఆ వ్యక్తులెవరో తెలుసుకుందుకి ప్రయత్నించలేదు. అందులో ఏ వ్యక్తి పరిచయం చేసుకుందుకన్నా నాకు అభిలాష కలగలేదు. ఎందువల్ల? ప్రపంచంలో అందరు మగాళ్లూ చెడ్డవాళ్లుకారే. కాని నా మనసు అటువేపు తిరగలేదు.

ఎలా తిరుగుతుంది? నా మనస్సులో ప్రతి క్షణం నాన్న గురించీ, అన్నా వదినా పిల్లల గురించీ, మా వంశ ప్రతిష్ఠల గురించీ, నా తండ్రి, నా అన్నల పరువుప్రతిష్ఠల గురించీ, పెళ్లి కావల్సిన పిల్ల ప్రవర్తించవలసిన మంచి నడవడి గురించీ ఆలోచనలు వున్నాయి. ప్రపంచంలోని మగాళ్లందరూ నాకేసి వెకిలిచూపులు చూసి ఇకిలించి నవ్వవచ్చు. కాని నేను నవ్వుతూ ఎవరితో నన్నా మాట్లాడేనా, యెవరితోనన్నా తిరిగేనా, నా పేరు యీ ఊళ్లోనేకాదు, మాకులంలో, శాఖలో పెళ్లికొడుకులున్న ఇళ్లవారందరికీ తెలుస్తుంది. "ఎవరూ? రాందాసు మాష్టారి ఆఖరిపిల్ల...? విన్నాం...విన్నాం ... ఆ అమ్మాయి గురించి...' ఆమాట చాలు – "విన్నాం విన్నాం" అని. ఏం విన్నారో యెవ్వరూ అడగరింక. కాబట్టి నాగురించి ఎవ్వరూ వినకూడదనే నా కోరిక.

అందువల్ల, అలివేణి రవీంద్రని ప్రేమించిందన్న నిజం, నా మనస్సుని ప్రేమ గురించి ఆలోచింపజేసింది. ఒక మాయాదండంతో ముట్టుకోబడ్డట్టు అలివేణి యొక్క మనస్తత్వమే మారిపోయింది!

ఇప్పుడు అలివేణి ఉదయం ఐదుకే లేచిపోతోంది.

## "వర్ణ" చిత్రాలు : : —విరాజి

### లంకాదహనం

లంకాదహనం చేసిన వీరభక్త హనుమాన్
తోక రూడించుకు మరీ ఎగిరొచ్చాడు
"మాసిరమ్మంటే కాల్చి వచ్చేవేమయ్యా' ? అంటే
అన్నాడట్లా అంధుడైన శ్రీరామభక్తుడు

'స్వామీ ! శబ్దరత్నాకరము తెరచి "మాడు"
మన్న మాట కర్థము తప్పక చూడుడు !'

### అక్షుల కక్షలు

ప్రక్కింట్లో మాడిన తాలింపు ఘాటుకి
కన్నీరొలికిస్తున్న కలకంఠి విశాలాక్షి మీద

సాంబ్రాణి పొలికిస్తూ మీ ఆయన
కొట్టాడా! అంది పొరుగింటి పోకిరి కామాక్షి !
ఔనమ్మా ఇట్టా కొట్టాడంట్లూ
ఒక్కటిచ్చింది విరిబోణి విశాలాక్షి !




ఆమె తల్లికి అన్ని పనులలోనూ సాయం చేస్తోంది. బాగా తెల్లారకుండానే స్నానం చేసేస్తోంది. తరవాత ఉతికిన బట్టలు కట్టుకొని, నన్నూ దుర్గపిన్నినీ, వదిననీ పలకరించి, ఏడుకల్లా వాళ్ల బంధువుల యింటికి వెళ్లే సాకుతో ఇంట్లోంచి వెళ్లిపోతుంది. ఆమెకీ ఊళ్లో మరో పేటలో ఒక పిన్ని వుంది, ఒక పినతండ్రి వున్నాడు. ఇంకా కొందరు దూరపు బంధువులున్నారు. తిరిగి తిరిగి ఏ పన్నెంటికో వస్తుంది. అన్నం తిన్నాక, మంచంమ్మీద పడుకొని ఏదో పుస్తకం తిరగవేస్తుంది. నాలుగవగానే బయల్దేరి వెళ్లిపోతుంది యీసారి ఆమె తల్లితో— ఇద్దరూ రాత్రి ఏ ఎనిమిదికో తొమ్మిదికో వస్తారు.

అలివేణి ప్రతిరోజూ రవీంద్రని చూస్తోందని గ్రహించేను. ఏరోజన్నా ఆమె ముఖం ముడుచుకొని వుంటే ఆరోజు రవీంద్ర ఆమెకి అగపడలేదన్న మాట. నాతో మాట్లాడినప్పుడు ఆమె పెదవులమీద చిరునవ్వు — ఆమె చూపులలో ... "ఔను ! నేను ప్రేమిస్తున్నాను ! నేను చాలా ఆనందంగా వున్నాను" అన్న భావన. నేను రవీంద్ర గురించి అడగబోతే ఆమె కళ్లలో ఒక తళుకు. "సమయమొచ్చినప్పుడు చెప్తాను" —అని మాట తప్పించేది.

రవీంద్ర సంగతి నేను పిల్లమ్మకి చెప్పడమా, మానడమా? చెప్పొద్దని నాదగ్గర మాట తీసుకుంది అలివేణి. నేను చెప్పటంవల్ల మంచికి బదులు చెడు జరుగుతే, జీవితమల్లా బాధపడాలి.

నాకు సంబంధించిన స్వవిషయా లలో ఈమధ్య పడవలసివచ్చి అలివేణి గురించి ఆలోచించడం తగ్గించేను. ఏమిటా స్వవిషయం? ఒక సంసారంలో యెదిగిన పిల్ల వుంటే ఆమె పెళ్లి గురించే ఆమె బంధువులంతా ఆలోచిస్తూవుంటారు. తమ ఎరికలో వున్న సంబంధాల గురించి తెలియజేస్తూవుంటారు పిల్ల తల్లిదండ్రులకి. నా పెళ్లి గురించి ఆలోచిస్తున్న బంధువులు వున్నారు — అక్క, బావ, వదిన తల్లిదండ్రులు, ఇంకా తదితర దూరపు బంధువులు.

అక్క నాన్నకి ఉత్తరం రాసింది. అందులో ఒక పెళ్లికొడుకు యొక్క వివరాలిచ్చింది. అబ్బాయి తల్లిదండ్రులు వాళ్ల వీధిలోనే వున్నారుట — వాళ్ల అబ్బాయి విశాఖపట్నంలో కాల్టెక్స్ కంపెనీలో స్టెనోగ్రాఫర్‌గా వున్నాడుట. అబ్బాయి బుద్ధిమంతుడు. వాళ్లకి కట్నం ఆశలేదు. పిల్లడికి పిల్ల నచ్చుతేచాలు. అబ్బాయికి పాతికేళ్లుంటాయిట. నెలకి నాలుగువందలకి పైగా జీతం. ఇద్దరు చెల్లెళ్ళు వున్నారు పెళ్లికి. అదంతా అతని తల్లిదండ్రులు చూసుకుంటారు. ఒక మంచిరోజు చూసి రాస్తే, ఆరోజున పెళ్లిచూపులకి వచ్చే ఏర్పాటు చేస్తానంది.

ఆ ఉత్తరం చూడగానే అన్నకీ, నాన్నకీ పెద్ద లాటరీ ప్రయిజు దొరికినంత ఆనందం కలిగింది.

అప్పుడే ఆ సంబంధం కుదిరిపోయినట్టు, వాళ్లు కట్నం పుచ్చుకోకపోతే యెంత ఖర్చయేదీ ఆ రాత్రి భోజనంచేస్తూ లెక్కలు వేసేరు.

"పెళ్లికొడుక్కి టెరిలిన్ బట్టలు ... పెళ్లికూతురుకి సిల్కు చీర — రెండు మూడు సాదా చీరలు — వియ్యంకుడికీ వియ్యపురాలికీ బట్టలు. ఇవే అవుతాయి ఐదువందలు — యింక పెళ్లికి కావల్సిన సరంజామా — వంటావార్పులు, దింపుళ్లకి, లడ్లు, అరిసెలు, చక్కిలాలూ యిత్యాదులు ... పిల్లని పంపేటప్పుడు సారె — తక్కిన పెళ్లి ఖర్చులు ... అన్నీ కలిపి దగ్గర దగ్గర రెండువేల వరకూ లాగేస్తుందే ?"

ఈ సంగతి విన్న కనకదుర్గ ఆమె సలహా ఆమె యిచ్చింది — "సింహాచలం కొండమీద పెళ్లి చేసేస్తే అట్టే ఖర్చుండదు. ఖర్చు తగ్గుతుంది..."

ఇలా వెళ్లింది సంభాషణ. ఇలా కొంతసేపు ఆనందం అనుభవించేక, ఎవరిమనాన్న (పై) వాళ్ళు వెళ్లిపోయేక, పెళ్లికి కనీసం పదిహేను వందలన్నా ఎక్కడ్నించి తేవడం అన్న ప్రశ్న వచ్చింది ఎప్పట్లానే వదిన, తన గొలుసు అమ్మేస్తే వెయ్యి రూపాయలొస్తాయంది. కనకరాజుని అడిగి ఒక ఐదు వందలు అప్పు తెస్తానన్నాడు అన్నయ్య. లాడి అప్పన్న కొట్టు మీద కొన్ని సామాన్లు అరువు తీసుకరావచ్చన్నారు నాన్న. అరువూ అన్న మాట వినిపించేసరికి, కనకరాజు కొట్టుమీద బట్టలుకూడా అరువు తీసుకరావచ్చని వదిన అంది.

ఇలా గాలిలో గబగబా మేడలు కట్టేసేరు. ఎప్పుడు మంచి రోజో పంచాంగం తీసి నాన్న లెక్కలు కట్టేరు. వచ్చే ఆదివారం కాక ఆ వచ్చే ఆదివారం మంచిదని నిశ్చయించేరు. ఒక పెద్ద ఉత్తరం అక్కకీ, బావకీ రాసేడు అన్న. అది అందరికీ చదివి వినిపించేడు. ఫలానా తారీఖున అతన్ని చూపులకి పంపవలసి రాయడమే కాకుండా, ఈ సంబంధం స్థిరపడేలా చూడవల్సిన బాధ్యత అక్కా బావలమీద వుందనీ, ఈ పెళ్లి జరుగుతే తన బరువు బాధ్యతలు తగ్గుతాయనీ, ఆ తరవాత తన పిల్లల గురించి ఆలోచించుకోగలడనీ రాసేడు.

నాకా రాత్రి నిద్రపట్టలేదు. రెండు వేల రూపాయల ఖర్చు — అదీ, కట్నం కోరకపోతే. అందుకు వదిన గొలుసు అమ్మడం, అన్నా నాన్నా అప్పులు చెయ్యడం. అవి తీర్చుకొనేసరికి కొన్ని ఏళ్లు పట్టడం. నావల్ల ఎంత కష్టం వచ్చిపడిం దందరికీ — ఏ ఖర్చూ లేకుండా, త్రినాథ్ వ్రతం పది పైసలుతో చేసినట్టుగా పెళ్లి జరిగిపోతే ఎంత

# ప్రశ్నావళి

—కె. రామలక్ష్మి

పి. ఎస్. — కాకినాడ

ప్రతి యుగంలోను కలహానికి కారణం స్త్రీయే అని పురాణాలు చెప్తున్నాయి. పెద్దలు అంటున్నారు. ప్రత్యక్షంగా మాస్తున్నాం. అటువంటప్పుడు స్త్రీ పురుషునితో సమానంగా హక్కులు పొందినప్పుడు ఈ మానవ ప్రపంచం నిలువ కల్గుతుందా?

★ మహారాజులాగా నిలబడుతుంది. ఇంతకి ముందు ఎన్నడూ ఈ భూప్రపంచంలో ఏ రకమైన ఆందోళనలూ రాలేదా? వాటినుంచి తేరుకుని నిలబడలేదా! వర్తమానమే భయంగా వుంటుంది గాని — గడిచిపోతే భయం వుండదు.

జి. ఎస్. — కర్నూలు

నాకు ఉద్యోగం లేదు. బి. కాం. పాసయ్యాను. ఉద్యోగం వున్న అమ్మాయిని చేసుకోడానికి ఆఫర్సు వస్తున్నాయి. చేసుకోమంటారా?

★ తరవాత కాంప్లెక్సులు పెంచుకుని కాల్చుకుతినని మనస్తత్వం మీకుందన్న నమ్మకం వుంటే — చేసుకోండి. కాని, వ్యక్తిగతంగా — సంపాదనాపరుడు కాని వ్యక్తి వివాహం చేసుకోకూడదని — నా నమ్మకం.

బి. కె. ఎస్. — చిత్తూరు

మనిషికి కావలసింది జీవించడంగాని హక్కులు కావంటాను. మీరేమో స్త్రీలకా సమాన హక్కులు కావాలంటారు...

★ చచ్చినవాళ్లలా బ్రతికే జీవితం కంటే — హక్కుల కోసం పోరాడుతూ చావడం మేలు. ఎలాగో అలా బ్రతికేయడమే జీవితానికి ధ్యేయం కాకూడదు. ఆ జీవితానికి కాస్త హుందా కావాలి. కాస్త పౌరుషం కావాలి.

ఎమ్. ఎస్. ఎస్. ఎమ్. — శ్రీహరికోట

ఆడవారికి చీరెలు, ఫాషన్లు జీవితాంతం సమకూర్చుట మగవారి బాధ్యత అన్నారు.

★ నేనెప్పుడూ అలా అనలేదు! అయినా — పెళ్లానికి కోక కొనడం ఊరికి ఉపకారం చేశానను కోవడం పొరపాటు అని అన్నానేమో!!

ఎస్. ఐ. — కటక్

ఇందిరాగాంధీ ఓడిపోవడం మీ స్త్రీ జాతికి అవమానం కాదా?

★ ఒక్క యిందిరాగాంధీయేనా స్త్రీ జాతి అంతా!! రాజకీయాలు — అదో ఆట. దానికి రూల్సు వేరే వుంటాయి. అంచేత గెలుపు ఓటమి అన్నవి నాణేనికి రెండు పక్కలు.

రాధ — మద్రాసు

నాకు మీమీద ఎంతో గౌరవం వుండేది. మీమీద పలురకాలుగా చెప్పుకున్నా వాళ్లతో వాదించేదాన్ని. కాని మీరు మా కాలేజీకి పిలిస్తే ఎంతో నిర్లక్ష్యంగా తిరస్కరించారు. అప్పుడు మీ కెంత గర్వమో అర్ధమైంది.

★ మంచిది. తుమ్మితే ఊడిపోయే ముక్కులాంటి నీ—గౌరవం — నామీద వున్నట్టు తెలియకుండానే పోయిందన్నమాట — చిట్టితల్లీ! చూడు కాలేజీ కార్యక్రమాలకి "పిలిచినప్పుడు" మాపై వుండే గౌరవం "తీరా వచ్చేక' మీకు వుండదని అనుకోడానికి — నీ నిదర్శన చాలదా?! (లేక మీరు పిలుస్తే 'చిత్తం' అని రాడానికి పెట్టే బేడా కట్టుకు ఎప్పుడూ సిద్ధంగా వుండాలా?!) మీకు పనీ పాటా వున్నట్టే మాకూ వుంటూవుంటుంది.

ఆర్. కె. — తెనాలి

...అల్లుడు సరైనవాడు కాదు. అందువల్ల నాకు మగపిల్లవాణ్ణి పెంచుకోవాలని వుంది.

★ ఎందుకు! కూతురికి చేసిన విర్వాకం చాలకనా?!... అల్లుడిపై కోపంకొద్దీ — కూతుర్ని గంగలో తోస్తారా?... ఆలోచించండి...

పి. ఆర్. — సికింద్రాబాదు

బుద్ధభగవానుడు చెప్పినట్లు తప్పులు చేయడం మానవ సహజం. తప్పులు శిక్షించడం — దానవత్వం. క్షమించడం దైవత్వం అన్నాడు. మరి మన పోలీసు శాఖవారు దానవులా?

★ పోలీసు శాఖలు సన్యాసం పుచ్చుకున్న బౌద్ధులు కారు — ముందా సంగతి గ్రహించండి. మీలెక్కన శిక్షించే తల్లి దానవి. శిక్షించే టీచరు దానవుడు... అంతేనా? చూడండి. తప్పులు చేయడం ఎంత మానవసహజమో, వాటి కనువైన శిక్షలు అనుభవించడమూ — అంత సహజమే.

ఎ. ఎస్ బి. ఏ. — ఆల్వాన్‌పల్లి

స్త్రీని అరిటాకుతోను పురుషుని ముల్లుతోను పోలుస్తుంటారు మీ రచయిత్రులు.

★ నేనెప్పుడూ యిలాంటి చొప్పదంటు 'పోలిక' రాయలేదు. అంచేత నేనేం చెప్పకలను?!

ఎ. జి. కె. — బరంపురం

మీరు రంగనాయకమ్మగారు చలంగారి ప్రియ శిష్యులా?

★ రంగనాయకమ్మ సంగతి నేను చెప్పలేను కాని — నేనెప్పుడూ చలంగారి శిష్యురాలినిగాను. చలంగారంటే యిష్టమేగాని — వారి భావనలతో ఏకీభవించలేను చాలాచోట్ల... వ్యక్తినీ — రచననీ విడిగా చూడలేని మీరీ సంగతి నమ్మినా నమ్మకపోయినా — నాకేం యిబ్బంది లేదు.

---

## ఒక కన్య చెప్పిన కథ

బాగున్నా? పెళ్లికొడుక్కి బట్టలు నాన్న ఎందుకు పెట్టాలి? అతను కొనుక్కోలేడా? సిల్కు చీరలు నాకెందుకు? మంచి నూలుచీరలు రెండు కొంటే చాలవా? తక్కినవి నన్ను తీసుకపోతున్న మనిషి బాధ్యత కాదా? గిన్నెలూ, ముంతలు, మంచాలూ, పరుపులూ, బట్టలూ, ఈ సరంజామా అంతా యిచ్చి నన్ను పంపించవలసిన బాధ్యత నా కన్నవారికెందుకు? అంత లేనివాడా పెళ్లి చేసుకుంటున్న మనిషి? అంత లేనివాడే అయితే అతడికి సంసారం ఎందుకు?

వంద రూపాయలతో పెళ్లి ఎందుకు జరగదో ఆలోచించేను. పురోహితుడికి-పది రూపాయలు ఒక గంట మంత్రాలు చదివినందుకు. తక్కిన సరంజామా అంతా మరో పది రూపాయలు — పెళ్లిపీటలమీదకి పెళ్లికూతురుకి బట్టలు — దేవుడి గుడిలో పెళ్లి — నలుగురూ వచ్చి దీవిస్తారు. చుస్ పెళ్లి అయిపోయింది. తాళి పెళ్లికొడుకు తెచ్చుకుంటాడు. ఆవుని ఉత్తినే పట్టుకపోయేవాడికి కన్నె తాడుకూడా యిస్తాడా యజమాని? కన్నె మెడకి నల్లపూసల కన్నెకట్టి తీసుకపోతాడు మగాడు — కని, యిన్నేళ్లూ ప్రేమగా పెంచి, విద్యాబుద్ధులు చెప్పించి, ఎంతో ప్రేమగా చూసుకుంటున్న ఒక సజీవ స్త్రీమూర్తిని, ఒక క్షణంలో జరిగిన తంతు తరవాత, వాళ్లకి అప్పగించేసి, ఆమెగురించి మరిచిపోవలసిరావడం ఎంత బాధాకరం! ఆడపిల్లని కన్న కుటుంబానికి ఈ విచారం ఎందుకు కలగాలి? ఒక్కసారిగా ఆ ఆడపిల్లకి మరి అమ్మా, నాన్నా, అన్నలూ, తమ్ముళ్లూ, స్నేహితురాళ్లూ ఎవ్వరూ వుండరు. తెలియని ప్రదేశానికి, తెలియని వ్యక్తులమధ్యకీ వెళ్లిపోవాలి. ఆ భర్తా, అత్తమామలు దయగా చూస్తారో లేదో తెలియదు, ఎవ్వరూ తన మంచి చెడ్డలూ బాగోగులూ చూడరింక. తను యింక ఒకరి మంచిచెడ్డలూ, బాగోగులూ చూడాలి. బరువు బాధ్యతలు ఒక సంసారానివి తనుకూడా తీసుకోవాలి. ఆడదెందుకా సంసారంలోకి వెళ్లాలి? మగాడే ఎందుకీ సంసారంలోకి రాకూడదు? మగాడు అతడి తల్లిదండ్రుల బాధ్యతలు తీసుకోవాలి — అప్పచెల్లెళ్ల బాధ్యత (పెళ్లి కానప్పుడు) తీసుకోవాలి. పోషించేవాడు మగాడు. పోషించబడేది ఆడది. ఆడదెప్పుడూ ఒక వస్తువే కామోసు. ఆమె తన యిష్టాలనీ, వుద్దేశాలనీ, భావాలనీ, మగాడి కోర్కెలకి అనుగుణంగా మార్చుకోవాలి.

ఆడదానికీ, ఆడదాన్ని కన్నవారికీ ఏదో పెద్ద బరువు, ఆపదా తప్పిస్తున్నట్టు అనుకుంటూ, ఆ పిల్లని తీసుకపోతున్నందుకు కట్నం కూడా యిచ్చుకోవాలంటే ఎంత హాస్యాస్పదం!

"వెయ్యి రూపాయలు తెచ్చుకుంటున్నవాడిని— ఆఫీసర్ని నేను — మీ పిల్లని నేను తీసుకవెళ్లాలంటే కనీసం యిరవై వేలన్నా యివ్వాలి."

"ఎందుకండీ ఇరవై వేలు?"

"నాతో మీ పిల్ల సుఖపడుతుంది. తిండికీ బట్టకీ లోపం వుండదు. నా హోదా ఆమె కూడా అనుభవిస్తుంది. లైట్లూ, పంకాలూ వున్న యింట్లో వుంటుంది. మా పిల్లలు కూడా పై అంతస్తులోనే వుంటారు."

"అదంతా బాగుంది. అది నీ భార్య ఆనందం, నీ ఆనందం. ఆ పిల్ల తల్లిదండ్రులకేం ఒరుగుతుంది? వాళ్లెందుకు ఇరవై వేలిచ్చుకోవాలి? పిల్ల సుఖపడాలని తల్లిదండ్రులలో సహజంగా ఉండే కోరికని, నువ్వు డబ్బుకింద మార్చుకుందామని చూస్తున్నావా?"

ఇలా నా మనస్సులో వాదప్రతివాదనలు చేస్తాను.

దీనికి మార్గాంతరం ఏముంది? దరిద్రుడి కూతురు దరిద్రుడినీ, ధనవంతుడి కూతురు ధనవంతుడినీ, ఆఫీసరు కూతురు ఆఫీసర్నీ, పెళ్లాడే అవసరం, అవకాశం, డబ్బు ఉండడం, లేకపోవడం కలిగిస్తోంది. సుఖపడడం మానటం సంగతి తరవాత వస్తుంది. [ఇంకా వుంది]

# బ్రిటానియా పాల బిస్కట్



## పెరిగే పాపాయిలకు రుచివంతమైన తోడు!




**రుచికరమైన, పుష్టికరమైన బ్రిటానియా గ్లాక్సో బిస్కట్లు**




బ్రిటానియా బిస్కట్లు అత్యుత్తమమైనవి

లింటాస్ GLX. 16-203 TL

# హైదరాబాద్ నోట్ బుక్

—తిరుమల రామచంద్ర

## డాక్టర్ ధర్మవరం మీరాబాయి అపూర్వచర్య

జూన్ 22న నీలోఫర్ ఆస్పత్రిలో ఒక విచిత్రం జరిగింది. శ్రీమతి రజియా సుల్తానా అనే గృహిణి అంతకుముందు 25 రోజులక్రితం పాతనగరంలోని జనానా ఆస్పత్రిలో ఆడశిశువును ప్రసవించింది. ఆ పసిపాప కడుపువాచినట్లు కనిపించింది. కాలేయం పెరిగి ఉంటుందని భావించి అక్కడి డాక్టర్లు పై చికిత్సకోసం పిల్లను, తల్లిని నీలోఫరు ఆస్పత్రికి పంపారు. శిశువు కడుపులోనిది కాలేయం పెరుగుదలకాదని, ఏదో గడ్డ అని నీలోఫరు ఆస్పత్రి డాక్టర్లు పిడియాట్రిక్ సర్జన్ డాక్టరు డి. మీరాబాయి ముస్నగువారు భావించారు. ఎక్స్‌రే ఫోటో తీయగా, అదికేవలం గడ్డకాక, పూర్తిగా పరిణామం చెందని పిండమని స్పష్టమయింది. శ్రీమతి రజియా సుల్తానా ఇదివరకే కవలలను కన్నది కనుక పసికందు కడుపులో ఈ పిండం కవలపిల్లల పిండమేనని,

ఈలాంటి పిండాలను టెరాటోమా అంటారని, వీటిని వెంటనే తొలగించకపోతే క్యాన్సరుగా పరిణమించవచ్చునని డాక్టర్లు అభిప్రాయపడ్డారు. తర్వాత డాక్టరు ధర్మవరం మీరాబాయి నాయకత్వాన శస్త్ర చికిత్సకుల బృందం ఆ 25 రోజుల శిశువుకు శస్త్రచికిత్సచేసి, పిండాన్ని వెలికితీశారు. పిండానికి పాదాలు, వేళ్లు, వెన్ను, పిరుదులు, స్పష్టంగా ఉన్నాయి. తలపైపున వెంట్రుకలున్నాయి. శ్రీమతి రజియాసుల్తానా, ఆమె భర్త శ్రీ మహమ్మద్ ఫజియుద్దీన్ ఆదిలాబాద్‌జిల్లా మరోట్ పట్టణంలో ఉపాధ్యాయులుగా పనిచేస్తున్నారు. ఈ శిశువు వీరి ఆరవ సంతు. సంవత్సర క్రితం రజియాసుల్తానా నాల్గవ కాన్పులో ఇద్దరు మగకవలలను కన్నది. శస్త్రచికిత్స పొందిన శిశువు రెండు రోజుల తర్వాత కన్ను మూసింది. శస్త్రచికిత్సక బృందానికి నాయకత్వం వహించిన డాక్టరు ధర్మవరం మీరాబాయి ఆంధ్ర నాటక పితామహుడు ధర్మవరం రామకృష్ణమాచార్యులు కుమారుడు, బళ్లారిలో సుప్రసిద్ధన్యాయవాది శ్రీ ధర్మవరం వేణుగోపాలాచార్యుల కుమార్తె. విశాఖలో ఎం. ఎస్. చదివారు. శిశు చికిత్స విభాగంలోనే పనిచేస్తున్నారు. శిశుశస్త్ర చికిత్స విభాగం ప్రొఫెసరు విదేశాలలో ప్రత్యేక శిక్షణ పొందారు. వివిధ వైద్య మహాసభల్లో శిశు విభాగాలకు అధ్యక్షత వహించారు. ఈ బృందంలోని ఇక్కిన డాక్టర్లు ఎస్. నాగరాజరావు, పి. ఎల్. సంఘి, వెంకటాచారి.

## భాగ్యనగరానికి మరొకశోభ

స్థానిక పారిశ్రామికవేత్త శ్రీ జగ్‌దీస్‌ప్రసాద్ సరాయివాలా టాంక్‌బండ్ కింద రామ్‌గోపాల్ మిల్సుకు ఎదురుగా సుందరమైన దేవమందిరాన్ని నిర్మించి నగరశోభను ఇనుమడింప జేశారు. ఈ మందిరం పేరు జగ్‌దీశ్‌మందిర్. త్రిమూర్తులకు, త్రితత్వాలకు, ప్రతీకగా మూడు మహాద్వార గోపురాలతో కన్నులపండువుగా ఉన్న ఈ దేవాలయం ఉత్తర దక్షిణాపథ కళాసమన్వయం. ఇది కేవలం పూజాస్థలంగానే కాక, విజ్ఞాన సంస్కృతి ప్రచార కేంద్రంగాను ఉపయోగపడుతుంది. ఇది రెండంతస్తుల దేవాలయం. రెండవ అంతస్థులో మూలవిరాట్టు శ్రీ వేంకటేశ్వరస్వామి ఆయన ఉభయ పార్శ్వాలలోను లక్ష్మి, తాయార్లు వేంచేసి ఉంటారు. కింది అంతస్థులో కథాకాలక్షేపాలకు పెద్ద హాలు, చలువరాతి వేదిక, వెనుకభాగాన ప్రేక్షకులను ఆకట్టుకొనేగజ స్తంభాలంకృతమైన ఆరుబయలు రంగస్థలం ఉన్నాయి. దేవాలయ ప్రవేశానికి విధి నిషేధాలు లేవు. పూజా విధానమంతా తిరుమల తిరుపతి పద్ధతిలో ఉంటుంది. ధర్మోపన్యాసాలు, సంస్కృత తరగతులు వుంటాయి. పుస్తక విక్రయశాల, పిల్లలకు ఆట వస్తువులను విక్రయించేశాల, ఒకకాంటీను ఉన్నాయి. దేవాలయ స్థాపకులు శ్రీ జగదీస్‌ప్రసాద్ సరాయివాలా హర్యానా నుంచివచ్చి హైదరాబాద్‌లో స్థిరపడిన స్వయం కృషితో పైకివచ్చిన పారిశ్రామికవేత్త. ఈయన మూడుసంవత్సరాలక్రితం బదరీనాథ్ యాత్ర చేసితిరిగివస్తూ, మహర్షి బాబా పరమేశ్వరదాస్ దర్శనం కోసం రాజస్థాన్‌లో ఆగారు. ఆయన ఉపదేశంతో ఈ దేవాలయం నిర్మించారు. 1975 మే 1వ తేదీ నుంచి దేవాలయ నిర్మాణం ఆరంభమయింది. 1977 జూన్ 22కు పూర్తయింది. జయపూరు లలిత కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ లల్లా నారాయన్‌శర్మ, మదురై (తమిళనాడు)నుంచివచ్చిన ప్రఖ్యాత స్థపతి శ్రీ యజ్ఞయ్యాచార్య ప్రధానంగా ఈ దేవాలయ సౌందర్యానికి కారకులు. శ్రీ జగదీశ్ ప్రసాద్ ఇదివరకు జగదీశ్ కమ్యూనిటీ హాలుకట్టించారు. దానికి అప్పటి ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి ప్రారంభోత్సవం జరిపారు. దేవాలయానికి రాష్ట్ర హైకోర్టు న్యాయమూర్తి శ్రీఅల్లాడి కుప్పుస్వామి జూన్ 26వ తేదీ ఉదయం లాంఛనంగా ప్రారంభోత్సవం జరిపారు.

## ఉపశ్రుతి:

అంతర్జాతీయ తెలుగుసంస్థ మహాసభ అంటే అంతా తెలుగులోనే ఉంటుందిగదా అని విందామని వచ్చానండీ. అంతా ఇంగ్లీషులోనే జరుగుతున్నదే! అని ఆశ్చర్యం ప్రకటించాడు నా వెంటవచ్చిన మిత్రుడు చిట్టిమిల్లి శరభయ్య. నేను ఏదో జవాబు చెప్పబోయాను. అంతలోనే ఒక ప్రతినిధి అందుకున్నాడు. అవునండీ తెలుగులోనే అంతా జరగవలసింది. నిజమే మనం మనం అంతా చర్చించుకుంటాం. బాగుంది. బయటివాళ్లకు మన సంగతి మన గొప్పదనం ఎట్లా తెలియాలి? ఇంగ్లీషులో ఉంటేనే అందరికీ తెలుస్తుంది అన్నాడు. ●



## చెల్లూరి సీతారాజేశ్వరరావు

ఆకర్షణ :

వడ్డించాను. రావచ్చు.

తులసి గుమ్మంలోకెళ్ళి గట్టిగా పిలిచింది. గోవర్ధనం పల్కలేదు. ప్రక్క వాటాలో ఉన్న శోభనాద్రితో రాజకీయాలు మాట్లాడుతున్నాడు క్రింద నిలబడి.

మిమ్మల్నే.... విసుగ్గా కేకేసింది తిరిగి.

పిలుస్తున్నారు శోభనాద్రి నవ్వి సైకిల్ ఎక్కాడు.

భార్యలా పిలవడం గోవర్ధనానికి నచ్చలేదు. అలా అరవడమెందుకు? గట్టిగా మందలిద్దామనుకున్నాడు. వాచీ తొమ్మిదిన్నర చూపిస్తోంది.

టైంలేదు.

గోవర్ధనం భోజనానికి కూర్చున్నాడు.

ఏం కలుపుకుందామాని గోవర్ధనానికి అనుమానమొచ్చింది. అంటే అక్కడ పదార్థాలు ఎక్కువగా ఉన్నాయని కాదు.

చారు తప్ప ఏం లేదు.

గోవర్ధనానికి కోపం వచ్చింది. ఈ వంటకి ఇంత లేటా? ప్రొద్దుటి నుంచి తులసి ఏం చేస్తున్నట్టు?

తులసి తనకేం పట్టనట్టు పెరటి గుమ్మంలోనించుంది.

పాపం కష్టపడి చారెందుకు పెట్టావ్? ఊరుకోవల్సింది. ఉపవాసముంచినా చెద్దును. ఈ రోజు ఏకాదశి కూడానూ. వెటకారంగా అన్నాడు.

తెచ్చి పడేస్తే వండడానికేం? కూరలు పట్టుకు రమ్మని నిన్నల్లా చెప్పాను. తప్పు తనది కాదంది తులసి.

గోవర్ధనం నొచ్చుకున్నాడు. కూరలు

తెస్తే వండేది. తను తేలేదు. ఏం? డబ్బులు లేక.... ఈ రోజింకా ఇరవయ్యో తారీఖు.

గోవర్ధనం అర్ధాకలిగాలేచాడు. చిరాగ్గా ఆఫీసుకి బయలుదేరాడు.

సైకిల్లో గాలిలేదు. అలాగే తొక్కేశాడు. కొట్టించడానికి పది పైసలివ్వాలవి.

అయిదు నిముషాలు లేటు.

ఆఫీసరు అక్షింతలు వేశాడు.

సీరియస్‌గా ఫైళ్లందుకున్నాడు. ఆకలి బాధ మరచిపోవడానికి.

ఒకటిన్నర.

హాలు ఖాళీగా ఉంది. క్యాంటీన్‌కి లేచాడు. గోవర్ధనం దృష్టి నిలిచిపోయింది. తన సీటుకి ఎదురుగా పర్స్.

ఎవరూ లేరు.

వేగంగా అందుకున్నాడు. మూడు వందల రెండుంది కాస్త చిల్లర ఉంది. వెనుక భాగంలో అడ్రస్ ఉంది.

తన ప్రక్క సీటు గోపాలంది. పడేసుకున్నాడు.

ఇచ్చేద్దామనుకున్నాడు గోపాలం కాంటీన్‌లో కనిపిస్తే. దరిద్రం ఆ పని చెయ్యనివ్వలేదు. గోపాలానికేం బంగారు పిచిక. వాడికీ డబ్బు లెక్కా?

టీ కంగారుగా త్రాగేశాడు. గోవర్ధనానికిప్పుడు ఆకలివేయడంలేదు. ఒకవేళ రాగానే గోపాలం చూచుకుంటే.... ప్రక్క సీటు కదా.... తనపై అనుమానం పడచ్చు.

గోవర్ధనం పర్సుని గోపాలం చిత్తుబుట్టలో దాచేశాడు.

నాలుగున్నరకి గోపాలం వెళ్లిపోయాడు.

గోవర్ధనం పర్సు తీసుకుని ఇంటికి నడిచాడు. మనసంతా తప్పు చేశామన్న దిగులు. భయం. అనుమానం. అందరూ గోపాలంగానే కనిపిస్తున్నారు.

ఇంటికి వచ్చినా శాంతిలేదు.

# త్రివేణి

తులసి చేదు కాఫీ యిచ్చినా త్రాగేశాడు. ప్రొద్దుట చదివిన పేపరు తిరిగి చదవసాగేడు. హోకన్ను రోడ్డు మీద ఉంచి.... గోపాలం వసున్నాడని.

తను తీస్తుంటే ఎవరయినా చూశారేమో? వాళ్లు గోపాలంతో చెబితే? చెప్తే ఇప్పటిదాకా వూరుకుంటాడా?

.. ఆఫీసు అయ్యాక చెప్పారేమో! ఇంటికి వచ్చి సోదా చేస్తే.... తను పట్టుబడిపోతాడు. దొంగయిపోతాడు. ఆఫీసులో తలయెత్తుకోవడం ఎలా?

గోవర్ధనం పర్సు తీసి పెరట్లో స్టోర్‌రూంలో.... బొగ్గుల బుట్ట అడుగున దాచాడు. గోపాల మొచ్చినా తనకేం బాధ లేదు.

అక్కడున్నట్లు ఎవరూ కనిపెట్టలేరు. తులసి కూడా!

తులసి భోజనానికి పిలిచినా అలాగే కూర్చుండిపోయాడు.

గోపాలం రాలేదు.

గోవర్ధనానికి ధైర్యం వచ్చింది. ఆ డబ్బు తనదే.

* * *

పాలవాడి కేకతో తులసి లేచింది. అయిదున్నరయింది. ఇంకా చీకటిగానే ఉంది. పాలు పోయించుకుంది. ఇక పడుకున్నా నిద్రపట్టదు. కాఫీ పెడదామని లోపలకెళ్లింది.

కిర్సనాయిలు లేక స్టౌ మండలేదు. కుంపటి వెలిగించడానికి బొగ్గుల కోసం వెళ్లింది. చీకట్లో ఆమె చెయ్యి తగిలి బొగ్గుల డబ్బా క్రిందపడింది.

ఏ బుట్టలోనో పోస్తే నయం.... అనుకుంటూ డబ్బా బోర్లా పోసింది. మెత్తగా తగిలింది బొగ్గులు ఏరుతుంటే. భయపడింది. తీసి చూసింది. పర్స్

ఇక్కడికెలా వచ్చిందబ్బా?

బయటికివచ్చి లైటు వెలుగులో పరీక్షగా చూసింది. చాలా రూపాయలున్నాయి. అక్కడికి ఎలా వచ్చాయో ఆమె ఆలోచించదలుచుకోలేదు.

తులసి పర్స్‌ని ఉప్పు రాచ్చిప్పలో పడేసింది.

కాఫీ అమృతంగా ఉంది. ఆ డబ్బు ఏం చేయాలో రకరకాలుగా ఆలోచించుకుంది. ఏ ఆలోచనయినా ఇతమిద్దంగా తెగలేదు.

పండగొస్తోంది.

మంచి చీర కొనుక్కోవాలి. ధనలక్ష్మి కొన్న టెలెక్స్ చీరలాంటిది.

ఆయన అడిగితే....

ఇంటి దగ్గర్నుంచి నాన్న పంపించాడని చెప్పవచ్చు.

తులసి హుషారుగా పనిచేసింది. భర్త లేచేసరికి వేన్నీళ్లు సిద్ధంగా ఉంచింది. లేవగానే స్ట్రాంగుగా కాఫీ యిచ్చింది.

'ఈ మర్యాదలేమిటి ?' గోవర్ధనం ఆశ్చర్యపోయాడు.

తులసి నవ్వి వూరుకుంది.

డబ్బు విషయం గుర్తు రాగానే గోవర్ధనము హుషారుగా ఈలవేశాడు.

రకరకాల కోరికలు

తులసినీళ్లు పోసి శివానికి చద్దన్నం పెట్టింది.

శివానికి చద్దన్నం సహించలేదు.

రంగయ్య హొటల్లోని ఇడ్లీలు నోరూరిస్తున్నాయి.

నిన్న ప్రసాద్ యిప్పించాడు.

ఎంత బాగున్నాయి? ఇవాళ కూడ తింటే.... తన దగ్గర డబ్బులేవీ? అమ్మ ఎప్పుడూ ఇవ్వదు. నాన్న ఎప్పుడయినా ఐదు పైసలిస్తాడు. ఇడ్లీ వస్తుందా దానికి?

శివం స్కూలుకెళ్లకుండా వుంచున్నాడు.

ఏరా? గోవర్ధనం అడిగాడు.

పుస్తకం కావాలి అబద్ధం చెప్పాడు.

సాయంత్రం కొనుక్కుందువుగాని

గోవర్ధనం స్నానానికి వెళ్లిపోయాడు.

శివానికి స్కూలు కెళ్ల బుద్ధికాలేదు ఇంట్లోకి వెళ్లాడు. ఎక్కడ వెతికినా డబ్బులు కనిపించలేదు.

ప్రక్కింటి బామ్మగారు వచ్చింది. మీ అమ్మ ఏదిరా?

నీళ్లోసుకుంటోందండి

హో గ్లాసుడు ఉప్పు ఇమ్మను.... నిన్న మా వాడు తేవడం మరిచిపోయాడు.

ఉప్పు కోసం తల్లిని పిలవడమెందుకు ?

శివం ఉప్పు ఇస్తుంటే పర్స్ కనిపించింది.

బామ్మగారికి ఉప్పు యిచ్చేశాడు.

పర్స్ తీసి సంచీలో వేసుకున్నాడు.

స్కూలుకు పరుగెత్తాడు.

గేమ్స్ రూం దగ్గర జనం ఎవరూలేరు. పర్స్ చూశాడు. చాల డబ్బుంది. శివం కళ్లు మెరిసాయి.

ఇక నాన్నని చాలాకాలం అడగక్కరలేదు డబ్బు. ప్రసాద్‌లా రోజూ టిఫిన్ తినొచ్చు. సినిమాలు చూడొచ్చు.

రంగయ్య హొటల్ స్కూలు ప్రక్కనే ఉంది. శివం హొటల్లోకి వెళ్లాడు. నాలుగిడ్లీ



# దరికి పోలేని మరుగుదొడ్డి



## భారతదేశంలో, మరుగుదొడ్డి మలినమయిన పదం? అలాంటి అవసరం లేదు.

నిజానికి చాల మంది వారి మరుగుదొడ్డిని అశుభ్రంగా ఉంచేస్తారు. ఇంత అశ్రద్ధ ఇంట్లో మరి ఏ చోటా ఉండదు. కను మరుగయిన చోటు అవటంతో మనకి దానిపై ధ్యాస ఉండదు. కాని చూడండి:

**శుభ్రత లేని మరుగుదొడ్డిని చూడలేం, వాసన భరించలేం. అది చాలా అనారోగ్యకరం, శాస్త్రవిరుద్ధం, తప్పని సరిగా హానికరం కూడా.**

ఇది మాత్రం ఏ మాత్రం హెచ్చు తగ్గులులేని పచ్చినిజం. కాబట్టి మిమ్మల్ని మీరే ప్రశ్నించుకోండి...

**మీ మరుగుదొడ్డి మీకు నచ్చిన శుభ్రతతో ఉందా?**

దీనికి జవాబు తెలిసికొనవలసినవారు ఒక్కరే—మీరే మరి.

ప్రతి ఉదయం దానిని శుభ్రపరచటానికి పనివానిని నియమించినప్పటికీ, అతను చేయవలసినంత శుభ్రం చేస్తున్నాడా లేక అషామాషీగా చేసేస్తున్నాడా?

వీటికి మీకు సరియైన జవాబు లేకపోతే, చూడండి—ఆ జవాబు ఇదే మరి... స్యానిఫ్రెష్.

**స్యానిఫ్రెష్ అంటే ఏమిటి?**

స్యానిఫ్రెష్ మరుగుదొడ్డిని శుభ్రపరిచేది. అది మీ అసహ్యమయిన పనిని, మీకు చేసి పెడుతుంది. మొదట మరుగుదొడ్డిని ఫ్లష్ చేయండి. తరువాత స్యానిఫ్రెష్‌ను మరుగుదొడ్డి లోపల అంతా విరివిగా చల్లండి. 3-4 గంటలు అలా ఉంచండి. రాత్రి అంతా ఉంచితే మరీ మంచిది. తర్వాత తిరిగి ఫ్లష్ చెయ్యండి. ఫ్లష్ పని చేయని పక్షంలో, బకెట్టుతో నిండుగా నీళ్లని వదలండి. అంతే, మరి మీ శుభ్రం గురించిన సమస్య తీరిపోయినట్లే.

**స్యానిఫ్రెష్ 3 విధాలుగా పనిచేస్తుంది:**

**1. స్యానిఫ్రెష్ పరిపూర్ణంగా శుభ్రం చేస్తుంది.**

ఇందులో ఎటువంటి మరకలనయినా మటుమాయం చేసే చురుకైన అంశం ఉంది. బ్రష్‌కు అందని భాగాలను కూడా శుభ్రం చేస్తుంది.

**2. స్యానిఫ్రెష్ హానికరమైన క్రిములను సంహరిస్తుంది.**

మరుగుదొడ్డి క్రిములు పుట్టి పెరిగే చోటు, తద్వారా అనారోగ్యాలకు మూలం. వీటినుండి మామూలు ఫినాయిలు ఇవ్వలేని రక్షణను స్యానిఫ్రెష్ ఇస్తుంది. కాబట్టి మీరు మీ మరుగుదొడ్డియొక్క బాగు ఓగులను గురించి నిశ్చింతగా ఉండవచ్చు.

**3. స్యానిఫ్రెష్ చెడు వాసనలను నిర్మూలిస్తుంది.**

మరుగుదొడ్డి భరించరాని వాసన వేయవచ్చు. సరియైన గాలి ప్రసారం లేక, ఈ సమస్య ఇంకా ప్రబలిపోతుంది. స్యానిఫ్రెష్‌లో ఈ చెడు వాసనలను చెదరగొట్టి మంచి వాతావరణాన్ని చేసే డియోడరెంట్ ఉంది.

స్యానిఫ్రెష్‌ను ఎప్పుడు ఎన్నిసార్లు వాడుతూండాలి? దానికి జవాబు, మరుగుదొడ్డియొక్క శుభ్రతలోని ముఖ్యతను అనుసరించి. ఒకసారి ఉంచి ప్రతి ఒక రోజూ.




**మీ మరుగుదొడ్డిని శుభ్రంగా ఉంచటానికి, మీ అసహ్యమైన పనిని, మీకు చేసి పెడుతుంది.**



ములు తిన్నాడు. పెసరట్టు తిన్నాడు.

చిల్లర తీసి యిచ్చాడు.

ఇంకా చాల డబ్బుంది. అది అంత తొందరగా తరగదని ఆపదేళ్ల మనస్సు సంతృప్తి చెందింది.

తన క్లాసులోకి నడిచాడు.

సంచీలో ఉంటే ఎవరయినా తీస్తారని పర్స్‌ని జేబులో పెట్టుకున్నాడు.

మధ్యాన్నం ఏ సినిమాకెళ్లాలో ఆలోచించుకొన్నాడు. ఎవరో నాయకుడు పోయాడని సెలవు ప్రకటించారు స్కూలికి.

శివం ఇంటికి బయలుదేరాడు.

## వికర్షణ

ఇంటికి వెళుతూంటే శివానికి భయం ఎక్కువయింది. డబ్బు పోయిందని ఇంటి దగ్గర తెలిసిపోయిందేమో. అమ్మ నాన్నకి తను తీసినట్లు తెలిసిపోయిందేమో!

శివం వేరుగా ఇంటికి వెళ్లలేదు.

అక్కడా ఇక్కడా తిరిగాడు.

పదయింది. తండ్రి ఇంటి దగ్గర ఉండడు. ఆఫీసుకి వెళ్లిపోతాడు. సాయంత్రం దాకా ఫర్వాలేదు.

అమ్మ కేకలేస్తుంది కాని కొట్టదు.

శివానికి తండ్రంటే చాల భయం. ఏమాత్రం తప్పు చేసినా చచ్చేలా కొడతాడు.

ఇంటికి బయలుదేరాడు శివం భయంగా.

కాని అనుకున్న ఉపద్రవం ఎదురవలేదు. ఇల్లు ప్రశాంతంగానే కనిపించింది. తులసి ఏదో పుస్తకం చదువుకుంటూ కూర్చుంది.

ఏరా స్కూలు లేదు కదా.... ఇప్పటిదాకా ఏం చేస్తున్నావ్?

శివం ఏదో గొణిగాడు.

అన్నం పెట్టనా?

తర్వాత తింటాలే.... శివం తండ్రి గదిలో పోయి కూర్చున్నాడు. పర్సు ఎక్కడ దాచాలో వాడికి తెలియలేదు. కంగారుగా ఉంది.

## త్రివేణి

అంత డబ్బు దగ్గరున్నా సుఖం కనిపించలేదు.

శివం పర్సుతీసి ప్రొద్దుట తీసిన స్థానంలో పెట్టేశాడు.

ఇప్పుడు వాడి మనస్సు ప్రశాంతంగా ఉంది. అయినా ఇంకా భయం పూర్తిగా తగ్గలేదు. తల్లి ఆ డబ్బు విషయం అడక్కపోవడం శివానికి భయం, అనుమానంగా ఉంది.

తులసి అన్నం తింటూ మజ్జిగలోకి ఉప్పు కోసం లేచింది.

పర్సు తగిలింది.

ఆమెకి తగని ఆశ్చర్యంగా ఉంది.

ప్రొద్దుటలేదు.

ఇప్పుడు ఉంది.

ఎలా వచ్చింది.

పర్సు పరీక్షగా చూసింది. ప్రొద్దుటిలాగా డబ్బు నిండా ఉంది.

అసలు ఈడబ్బు ఎవరిది?

బొగ్గుల పెట్టెలోకి ఎలా వచ్చింది.

తులసికి అనుమానాలు ఎక్కువయినాయి. ఆ డబ్బుని అనుభవించడం కంటే ఎలా వచ్చిందో తెలుసుకోవాలనిపించింది.

బొగ్గుల పెట్టెలో దాచేసింది.

ఓ కన్ను మాత్రం వేసి ఉంచింది.

ఒంటి గంటకి గోవర్ధనం వచ్చేశాడు.

ఏం అప్పుడే వచ్చేశారు? మంచినీళ్లు ఇస్తూ అడిగింది.

ఒంట్లో బాగాలేదు.

లుంగీ చుట్టుకుని పడుకున్నాడు.

అసలు కారణం అదికాదు.

ఆ పర్స్ ఏమయింది?

దొరికిన పర్సు దొరక్కుండాపోయింది.

అయినా అక్కడే దాచడం తన తప్పు. తమ రెండు వాటాల వారికి కామన్‌గా అదేస్టోర్ రూం— ఎవరయినా తీయొచ్చు.

తులసి తీసిందేమో?

తీస్తే చెప్పదూ?

అడిగితే....

ఏమనడుగుతాడు?

బొగ్గుల పెట్టెలో దాచానంటే నవ్వదూ అడిగితే ఏం చెబుతాడు?

గోవర్ధనం నాలిగింటిదాకా మంచం మీద దొర్లాడు.

లేవరాదూ.... టీ ఇస్తాను. తులసి కేకేసింది.

సబ్బు తీసికొని బాత్‌రూంలోకి వెళ్లాడు.

మళ్లీ ఒకసారి వెతికితే?

అనవసరం... ప్రొద్దుట లేనిది ఇపుడుంటుందా

ప్రొద్దుట తను సరిగ్గా చూడలేదేమో?

గోవర్ధనం వెతికాడు.

పర్స్ చేతికి తగిలింది.

ఆత్రంగా చూశాడు. డబ్బు యధాతథంగా ఉంది.

సంతోషంతో. ముఖం విప్పారింది.

పర్స్ లుంగీలో దాచి ముఖం కడుక్కుండా ; వచ్చేశాడు. ప్రొద్దుటి నుంచి పడిన బాధంతా గాలికి ఎగిరిపోయింది.

ఇదంతా తులసి చూస్తూనే ఉంది.

ఆ డబ్బు భర్తదా?

అయితే అక్కడెందుకు దాచాడు?

అడుగుదామనుకుంది.

అడగలేకపోయింది.

గోవర్ధనం హడావిడిగా టీ త్రాగి బట్టలు వేసుకుని బయటకు నడిచాడు. డబ్బు చేతిలో ఉండగా ఇంట్లో కూర్చోవడం అర్థం లేని పని.

సెంటర్లోకి వచ్చాడు.

వెల్‌కం హోటలు దగ్గర గోపాలం కనిపించాడు.

అతడ్ని పలకరించడానికి ధైర్యం చాలలేదు.

తప్పు చేశానన్న భావం ఉక్కిరిబిక్కిరి చేస్తోంది.

గోపాలమే పలకరించాడు. రా.... కంపెనీ లేరని చూస్తున్నాను. ఇద్దరూ లోపలికెళ్లి కూర్చున్నారు. గోపాలం పెసరట్లు ఆర్డర్ చ్చాడు.

విన్నా నా పర్స్ పోయిందోయ్. బహుశా ఆఫీసులోనే పడిపోయి ఉంటుంది.

గోవర్ధనం సర్దుకుని కూర్చున్నాడు. ఎవరికి దొరికిందో?

మా చుట్టం ఒకాయన ఆంజనేయ ఉపాసకుడు. వాళ సోమవారం. రేపు మంగళవారం కదా వెళ్లి ప్రశ్న అడుగుతాను.కరెక్ట్‌గా పేరుతో! సహా చెపేస్తాడు.

ఆ చుట్టం ఎవరో గోవర్ధనానికి తెల్సు.

ఆయనకి మంచి పేరుంది.

తను బయటపడిపోతాడు.?

గోవర్ధనానికి భయంవేసింది. అవమానం ఎదురవుతుంది ఆఫీసులో. గోవర్ధనం దొంగ అంటారు....

తొందరగా టిఫిన్ తిని పని ఉందంటూ



గోవర్ధనం తీసుకున్నాడు. మనస్సు నిప్పుల గుండంలో తొక్కినట్లు ఉంది.

ఏం చెయ్యాలి?

గోవర్ధనానికి తనమీద కోపం వచ్చింది.

కక్కుర్తి ఎంత పనిచేసింది?

అక్కడా ఇక్కడా తిరిగి ఇంటికి వెళ్ళాడు.

భార్య శివాన్ని కొడుతోంది.

ఎందుకూ శివాన్ని విడిపిస్తూ అడిగాడు.

నారాయణగారింట్లో బంతి దొంగిలించికుని వచ్చాట్ట. ఆఖరికి వీడికి వెధవ బుద్ధులు వస్తున్నాయి. తులసి మరో రెండు వేసింది.

కుర్ర వెధవ.... ఊర్కో. శివాన్ని దగ్గరికి లాక్కున్నాడు.

ఊరుకుంటే పెద్ద దొంగతనాలకే దిగుతాడు.




ఆంధ్రప్రదేశ్ సేవింగ్ & ఫైనాన్సు

# జయశ్రీ గ్రూపులో

## సభ్యులుగా చేరండి ఉచితంగా!



మొదటి నెలలో రు. 26 చెల్లించి సభ్యులుగాచేరి వెంటనే జిప్ హేండ్ బేగ్ పొందండి!

క్రమము తప్పకుండా ప్రతి నెల రు. 21 చొ॥న 20 మాసములు చెల్లించాలి!

6వ నెలలో జిప్ ఎయిర్ బేగ్. 11వ నెలలో జిప్ డాక్యుమెంటు ఫైలు.
16వ నెలలో బ్రీఫ్‌కేస్, 21వ నెలలో పాకెట్ ట్రాన్సిస్టర్ మరియు
60 మాసముల డ్రాలలో 18,195 బహుమతుల విలువ రు. 3,63,000.

61వ మాసములలో ప్రతీ సభ్యునికి 4½ x 2½ సైజుల స్టీల్ బీరువా లేక సోఫా కంబెడ్ లేదా 26వ నెలలోనే పొందే అవకాశంకూడా కలదు!

ఆదా చేయండి! ఆదాయం పొందండి!

పూర్తి వివరములకు

**ఆంధ్రప్రదేశ్ సేవింగ్ & ఫైనాన్సు**

(గవర్నమెంటు రిజిష్టర్డు నెం. 2370)

పోస్టుబాక్సు నెం. 47  రాజమండ్రి-533101

ఫోన్: 1411  గ్రామ్సు: సేవింగ్

జీతముపై లేక కమీషనుపై ప్రతినిధులు, డెవలప్‌మెంటు ఆఫీసర్లు కావలెను

ఆంధ్రప్రదేశ్ అంతటా బ్రాంచీలు, ఏజన్సీ ఆఫీసులు కలవు

## కాల్చుకుతిన్న కక్ష

కోయంబత్తూరుకు చెందిన వజ్రాల వ్యాపారి లక్షాధికారి 35 ఏళ్ళ నవకోటి సెట్టియార్ అనే ఆయన భార్య అన్నగారు 40 ఏళ్ళ రాధాకృష్ణన్ ఒకమ్మాయిని పెళ్ళి చేసుకుని, ఆమెను తీసుకు బెంగుళూరు వెళ్ళి ఏవేవో వ్యాపారాలు చేసి, తన పేర్నున్న ఆస్తివంతా తగలబెట్టి కోయంబత్తూరు తిరిగి వచ్చి నవకోటిసెట్టియార్‌ను ధనసహాయం అడిగితే ఆయన ఇచ్చేది లేదు పొమ్మన్నాడట.దాంతో రాధాకృష్ణన్ భార్య విడాకులు యిమ్మని కోర్టును కోరిందట. ఈ అవమానం భరించలేని రాధాకృష్ణన్ నాకు డబ్బివ్వక పోయావో నీ అంతు చూస్తానని బెదిరిస్తే ఆయన పోలీసుల సహాయం కోరితే వాళ్ళొచ్చి మధ్యవర్తిత్వం వెలిగించారట. మళ్ళీ కొన్నాళ్ళలో గొడవ ప్రారంభమయ్యేసరికి సెట్టియార్ కోయంబత్తూరు మేజిస్ట్రేటుకు వో అప్లికేషను పెట్టుకుని, తనకు రక్షణ కావాలని కోరారట. ఆ అప్లికేషను విచారించి నిర్ణయింపుకు వచ్చేలోగా యీ

# ఫైళ్ళని డైరి

విషయం రాధాకృష్ణనుకు తెలిసి, సెట్టియారు తన స్వంత అయిన్ ఫ్యాక్టరీలో ఆరుబయట కూర్చుని వుండగా [జూన్ 8 వ తేదీ] వెళ్ళి తుపాకీతో బావమ్మని కాల్చాడట. కానీ ఆ గుండు గురి తప్పిందట. సెట్టియారు లేచి ఫ్యాక్టరీలోకి పారిపోతుండగా కాల్చిన మరో గుండూ కూడా గురి తప్పిందట. సెట్టియారు వో గదిలో కి పోయి లోపలకు తలుపు వేసుకు దాక్కుంటే, రాధాకృష్ణన్‌తుపాకితో ఫ్యాక్టరీలోని వారిని బెదిరించి, తానే ఆ తలుపులు విరిచి , ఆయన్ను బయటకు లాగి, తలలో తుపాకీ పేల్చాడట. మరొకటి కుడి బుగ్గలో పేల్చాడట. సెట్టియారు చనిపోడంతోనే తాను కూడాకాల్చుకు చనిపోయాడట— ఆత్రాన్ని మించిన శత్రువు లేదు, ఆవేశపరుణ్ణి మించిన రాక్షసుడు లేదంటూ రందుకనే.!

## పనివాడి ఘాతుకం

బాబా అణుశక్తి కేంద్రంలో వో పెద్ద పదవిలో వున్న శ్రీమతి నీలా అనే ఆవిడ బొంబాయి చెంబూరు ప్రాంతంలో వుంటోందట. ఆమె భర్త కూడా వో ఫ్యాక్టరీలో మేనేజరుగా పని చేస్తున్నారట. ఆ యింట్లో నారాయణన్ అనే వో ఇరవై యేళ్ళ కుర్రాడు పని చేస్తున్నాడట.నారాయణన్ ఒకనాడు ఆమె భర్త లేని సమయం చూసి ఆమెను బలాత్కరించబోయాడట. ఆమె అతన్ని ప్రతిఘటించి, యీ విషయం తన భర్తకు చెప్తే ఆయనాతన్ని తిట్టి, పనిలోంచి తీసివేశాడట. దాంతో నారాయణన్‌కు కోపం వచ్చి మరోసారి బలాత్కారం చేయ ప్రయత్నించాడట. ఆ ప్రయత్నం ఫలించకపోయేసరికి కత్తితో ఆమెను పొడిచేడట. ఆమె వేసిన గావు కేకలకు చుట్టుప్రక్కల

---

తులసి ఆవేశంగా అంది. భర్తని సునిశితంగా పరిశీలించింది.

తెలియక చేశాడు.... ఏరా? ఇంకెప్పుడు చెయ్యకేం? కొడుకుని అడిగాడు.

శివం తలూపాడు.

తులసికి సందేహం తీరింది.

గోవర్ధనం అలాగే కూర్చుండిపోయాడు. శివం దొంగవుతున్నాడా? తన వారసత్వమా ? దొంగ కొడుకు దొంగా.

గోవర్ధనం మరొకప్పుడయితే కొడుకుని చావ బాదేవాడు. ఇప్పుడు నైతికంగా తను శిక్షించలేడు. తను దొంగ.

కొడుకును ఎలా కొడతాడు?

గడియారం ఎనిమిది కొట్టింది.

తులసి భోజనానికి పిలవకపోవడంతో తనే లోపలికి వెళ్ళాడు· తులసి సీరియస్‌గా కూర్చుంది.

వడ్డించలేదా ?

లేదు.

ఏం?

డబ్బులున్నాయి కదా.... ఏ చికెనో తినివచ్చారనుకున్నాను.

గోవర్ధనం ముఖం మాడిపోయింది. డబ్బు సంగతి ఆమెకెలా తెల్సింది.

ఏం మాట్లాడుతున్నావో తెలుస్తోందా ? భార్యని గద్దించి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి గోవర్ధనంకి నిద్రరాలేదు.

దొంగ కలలు వచ్చాయి.

ఈ బాధ పడలేక పర్స్ మర్నాడు యధాస్థానంలో పెట్టేశాడు.

గోపాలం దాన్ని అందుకున్నాడు. గోవర్ధనం మనసు శాంతించింది.

## సంఘర్షణ

గోపాలం క్యాంటీన్లో కనిపించాడు గోవర్ధనానికి పాపం దొంగ చాల మంచివాడోయ్. వేశ్రమ

## త్రివేణి

పడకుండానే పర్సుని డ్రాయర్‌దగ్గర పడవేశాడు·

పోనీలే... నీ డబ్బు దొరికింది. దొంగని కనుక్కుంటావా ?

ఇంకా ఎందుకు? తెలిసిపోతే

ఎవరు? గోవర్ధనం భయపడ్డాడు.

నేను సైకలాజికల్‌గా సాల్వ్ చేశాను. నా ప్రక్కన నువ్వు మురహరి. సీట్లో పడిపోయి ఉంటే మీ యిద్దరిలో ఎవరో తీసి ఉండాలి.

ప్రశ్న అడగాలని నీతోను మురహరితోను చెబుదామనుకున్నాను.

మురహరి కనిపించలేదు.

నువ్వు కనిపించావు. నీతో చెప్పాను.

నా పర్సు నా దగ్గరికి వచ్చింది.

థాంక్యూ!

నీలాంటివాడు దొంగ కాలేడు.

కీప్ దట్ ప్లీస్

గోపాలం పెద్ద పెద్ద అంగలేసుకుంటూ వెళ్ళిపోయాడు.

గోవర్ధనం ముఖం చిన్నబోయింది.

అంటే తను పట్టుబడిపోయాడు మర్యాదగా.

కాని ఒకటి మాత్రం నిజం.

తాను దొంగ కాడు.

గోవర్ధనం ఆఫీసయ్యాక ఇంటికి బయలుదేరాడు. గోపాలంవంటరిగా ఇంటికి వెళుతున్నాడు. దగ్గరకెళ్ళాడు.

ఈ విషయం ఎక్కడా చెప్పక..·. నా రిక్వెస్టు.

గోపాలం తల ఊడించాడు.

గోవర్ధనం ఇంటికి వచ్చాడు.

శివం పెరట్లో ఏడుస్తున్నాడు.

మళ్ళీ ఏడుపెందుకు?

వాడు మాట్లాడలేదు.

తులసి వంటింటి నుంచి వస్తూ ఏమైందీ... బళ్ళో ఎవరి పెన్సిలో దొరికిందంటూ పట్టుకొని వచ్చాడు. ఎవరిదో దొంగిలించాడని రెండు వేశాను అంది.

గోవర్ధనం కొడుకుని పిలిచాడు.

పెన్సిల్ ఎక్కడిది?

శివం ఏడుస్తూ మాట్లాడలేదు.

గోవర్ధనం బెత్తం ఉపయోగించాడు.

శివం నిజం చెప్పాడు.

పెన్సిల్ సీనుది.

ఇలాంటి వెధవ పనులు చెయ్యవుకదా ! అంటూ అంటూ మళ్ళీ కొట్టాడు.

తులసి అడ్డుపడింది.

కొడుకుని విడిపించి బయటికి పంపేసింది.

భర్తకి టీ తీసుకునివచ్చింది. నా అనుమానం తీరిపోయింది. పర్స్ మీరు యిచ్చేశారన్న మాట. మీరు దొంగ కారు.

గోవర్ధనం విస్తుపోయాడు.

నిన్న మీరు పర్సు తీస్తుండగా చూశాను. అక్కడ ఎందుకు దాచారో నాకు తెలియలేదు తెలుసుకోడానికి శివంతో చిన్న నాటకమాడాను నిన్న శివం దొంగతనం చేశాడంటే మీరేం మాట్లాడలేదు. అంటే తప్పు మీరు చేశారన్న మాట. ఇవాళ శివాన్ని శిక్షించడానికి ముందుకు వచ్చారు. అంటే మీ తప్పుని మీరు సవరించుకున్నారు.

అవును తులసీ.... ప్రలోభపడ్డాను.. కాని సంఘర్షణ అణచుకోలేకలేకపోయాను. అందుకే గోపాలం పర్స్ యిచ్చేశాను.

నా సమాధానానికి ఏమీ: వెయ్యకి ఆపకి ఎధుని కొట్టించాను. వాడికి బజారు నుంచి స్వీట్సుయినా పట్టుకురండి.

గోవర్ధనం తలూపాడు.

# ఫాలాకుని డైరీ

వారంతా చేరి, లోపలకు వేసున్న తలుపులు విరగదీసి చూస్తే శ్రీమతి నీలా రక్తపు మడుగులో విలవిలా తన్నుకుంటోందట. హంతకుడింకా యింటిలోనే వుండివుండాలని గమనించిన పోలీసులకు చెప్తే వాళ్ళొచ్చి యిల్లంతా వెతికి నారాయణన్‌ని అతను హత్య చేయ వుపయోగించిన కత్తిని పట్టేశారట.

## సైకిల్‌వాలా తీసిన 9 ప్రాణాలు

23 వ తేదీ మధ్యాహ్నం ఒంటి గంటవేళ సేలం నుంచి ఈరోడ్డు పోతున్న ఓ రాళ్ళ లారీ పల్లిపాలెంలో పోతుండగా ఓ సైకిలు కుర్రాడు అడ్డు వచ్చాడట. ఆ కుర్రాడి ప్రాణం కాపాడ్డం కోసం లారీ డ్రయివరు చేసిన ప్రయత్నంలో లారీ గతితప్పి సర్రున తలక్రిందులై, అదే స్థితిలో సర్రున జారుకుంటూ వెళ్ళి ఓ పెంకుటింట్లో దూరిపోయిందట. లారీలోని కంకర్రాళ్ళ మీద కూర్చున్న తొమ్మండుగురు పని వాళ్ళు క్రింద పడి, వారి మీద రాళ్ళు, ఆ రాళ్ళ మీద లారీ పడ్డంతో సజీవ సమాధి అయిపోయారట. డ్రయివరు కూడా అదే చోట చనిపోయాడు. వూళ్ళో జనమంతా పోగై రాళ్ళలో గిలగిలా తన్నుకు చనిపోయిన తొమ్మండుగుర్నీ పైకి తీశారట. ప్రమాదంలో డ్రయివరు పక్కన కూర్చున్న క్లీనరు మాత్రం కాలి మీద ఓ చిన్న గాయంతో బయటపడ్డాడట.

## కనక వ్యామోహం

భవాని తాలూకా గంగరా పాళయంలో షణ్ముగం అనే అతనికి, 18 ఏళ్ళ శివకామి అనే ఆమెకు ఏడు నెలల క్రితమే వివాహమయ్యిందట. ఆ నాటినుంచీ తనకు ఒంటిపేటగొలుసైనా బంగారంది లేదని శివకామి భర్తతో అనునిత్యం పోరు పెడ్తుండేదట. షణ్ముగం శక్తి మేరకు ఆమెను వారించి, కుదరపోయినపుడల్లా తిట్టి పోస్తుండేవాడట. ఇది భరించలేక, కనకం మీది వ్యామోహం చంపుకోలేక, శివకామి నల్లుల మందు త్రాగి ఆత్మహత్య చేసుకున్నదట. ●

త్వరలో

"మాయాజాలం

మతికట్టు"

# డాక్టరు సలహాలు

## డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

### కె. బి ఆర్ – రాజంపేట

నా వయస్సు 18 సం. లు నాకు 5 సం లుగా నెలకొకసారి, తలనొప్పి వచ్చి మూడు గంటలసేపు వుంటుంది. తగ్గేటప్పుడు పసరుగా డోకువస్తుంది ఇలా ఎందుకు జరుగుతుంది. ఏ మందులు వాడాలి!

ఇలా ఒక క్రమ పద్ధతిలో తలనొప్పి, డోకుల రావటం, అనేది ఒక రోగ లక్షణాలు మాత్రమే! ఆ రోగాన్ని "మైగ్రైన్" అని ఆంగ్ల వైద్య శాస్త్రంలో పేర్కొంటారు. తల ఒక వైపున మాత్రమే గాని, ఇరువైపులాగాని ఎక్కువగా తల ముందు— మధ్య భాగాలలో విడువకుండా గంటల తరబడి తలనొప్పి రావటం, దానితోబాటుగానో లేక అంతిమదశలోనో వాంతులు రావటం ఈ రోగు లలో కనబడే సహజ లక్షణాలు మెదడు మీద పయనించే రక్తనాళాల గోడలు వ్యాకోచించటం వల్ల, ఆ చోట (రక్తనాళాల గోడలలో) ఉండే నరాల చివళ్ళతో ప్రేరేపించబడి ఆ వ్యాకోచస్థితిని భరించలేక నొప్పి అనే సందేశాన్ని పంపే నరాల ద్వారా మెదడుకి తెలియచేయుట లేక ఈ నొప్పికి (మైగ్రైన్) కారణం అని అంచనా! యుక్త వయస్సులో ప్రారంభం అయి మధ్య వయస్సువరకూ ఈ రోగ లక్షణాలు కనుపించవచ్చు!

మానసికాందోళన కలిగించే విషయాల జోలికి పోకపోవటం విశ్రాంతి, చీకటి గదిలో పడుకో బెట్టడం — మందు మాత్రలు వైద్య సలహా పై వాడటం ఈ రోగానికి వాడతగిన చికిత్సా విధానం.

### ఎస్. కె. - నిజామాబాద్

భార్యా, భర్తల్లో ఒకరికి టి. బి. వుంటే అది రెండో వారికి సంక్రమించే అవకాశము ఉన్నదా?

ఈ ప్రశ్న నిజంగా ఎంతో ప్రశంసనీయమైన దని ముందుగా తెలియజేస్తూ, ఈ ప్రశ్నకి జవాబు ఇవ్వడం అంత సులభం కాదని కూడా వ్రాయ వలసి వస్తున్నది.

క్షయరోగం అంటు రోగాల తెగకే చెందినా, అది కుటుంబ సభ్యులకు, అందులోనూ భార్యా భర్తలలో ఒకరి నుంచి ఇంకొకరికి రావటం అనేది రోగి ఆరోగంతో బాధపడినకాలం, రోగం ఆ సమయంలో ఉన్న ఉధృత, రోగాన్ని పుణికిపుచ్చు కొనేవారి శరీరంలోని రోగనిరోధక శక్తి, శారీరక పరిస్థితులు మొదలయినవి. ఇతరులకు ఈ రోగం రావటాన్ని నిర్ణయిస్తాయి.

ఒక విధంగా మీరడిగిన ప్రశ్నకి అవునుఉన్నదనీ, ఇంకోవిధంగా లేదనీ, ఏరో దృక్పథంతో ప్రస్తుతం ఏమీ చెప్పలేమనీ, వస్తే రావచ్చు. లేకపోవచ్చనీ జవాబు వ్రాయటం సులభము. అయినా మీరు తరచు ఎక్సరే మొదలయిన పరీక్షలుచేయించుకోవ టంవల్ల ఆ రోగ లక్షణాలను మొదట్లోనే నివా రించవచ్చును.

### ఎ. బి. – నడిపూడి

నాకు చాలా కాలము నుండిగొంతువద్ద నరాలు లాగునట్లు, నొప్పిగా ఉన్నట్లు ఉంటున్నది. దీనికి కారణమేమిటి ?

గొంతువద్ద నరాలు లాగునట్లు, నొప్పిగాఉన్నట్లు మాత్రం వ్రాస్తే, రోగ నిర్ధారణకి ఎంతో కష్ట తరమవుతుంది. టూకీగా మీ రోగ లక్షణాలను, 4 లేక 5 పంక్తులలో అన్ని వివరాలనూ తెలియ జేసేవిగా రాయండని ఈ శీర్షిక పాఠకులకు ఈ సందర్భాన్ని పురస్కరించుకుని తెలియజేస్తున్నాను.

నా ఊహనుబట్టి మీ గొంతులోని ఏ వైపు ఉన్న థైరాయిడ్ గ్రంధి వాచినదీ లేనిదీనిర్ణ యించుకోవాలని, లేక ఇ. ఎన్. టి. వైద్యులచే మీ గొంతులోపలి భాగాలను పరీక్షించుకోవాలనీ అనే సలహా ఇవ్వగలను.

అలా క్రమ పద్ధతిలో నేరుగా రోగానికి తగిన వైద్యులచే పరీక్షించ చేసుకోవటం ముందుగా శ్రమ కొంతవరకు ఆర్థిక ఇబ్బంది అయినా, దాని వల్ల ఎంతో విలువైన కాలమూ, దానికన్నా లోం దరగా నయమయ్యే రోగాన్ని ముదరబెట్టకుండా ఒదిలోనే నయం చేసుకోగలగటం అనేవి ఈశాస్త్రీయ విధానానికిమద్దతు ఇస్తాయి !





# తమసోమా జ్యోతిర్గమయ

(18వ పేజీ తరువాయి)

"ఏదో ఆ భగవంతుని దయవలన ఈ మాత్రమైనా కలుసుకున్నాం చాలు" అన్నాడు.

సుజాత తలతిప్పి అతనివైపు చూసింది. అతనేమో రోడ్డుపక్కన ఉన్న షాపులవైపు చూస్తున్నాడు. ఒక్కక్షణం అతనివైపు కన్నార్పకుండా చూసి తల తిప్పుకుంది.

ఈలోగా జంక్షను దగ్గరకు రానేవచ్చారు. సిటీబస్‌కూడా అప్పుడే వచ్చింది.

బస్సెక్కబోతూ వెనుదిరిగి చూసి... 'వెళ్తా' నన్నట్లు చిన్నగా మందహాసం చేసింది సుజాత!

"రెండే రెండు రోజులు. తర్వాత వచ్చేస్తాను. వీలయితే మీ ఆలోచనలలో నన్ను అప్పుడప్పుడు గుర్తు చేసుకుంటూ ఉండండి. చాలు!" అన్నాడు విక్టర్!

బస్సు కదిలి, కనుమరుగయేవరకు అక్కడే ఉండి, చుట్టూ చూస్తే అప్పుడు జ్ఞాపకం వచ్చింది అతనికి. తన స్కూటరును శివరావుగారి యింటివద్దనే మర్చిపోయి వచ్చాడని!

చిన్నగా నవ్వుకొని మళ్ళీ వెనక్కి తిరిగాడు.

## 5

'ఎంత ధైర్యం..." అనుకుంది సుజాత. మంచంమీద వెల్లకిలా పడుకొని.

రాత్రి భోజనంచేసి, పుస్తకం తీస్తే... అక్షరాలు చీమలబారుల్లా కనిపించాయేగాని ఒక్క ముక్క తలకెక్కలేదు.

రామం, మురళి వచ్చి భోజనాలు చేసి వెళ్ళాక, కామాక్షమ్మ వంటిల్లు సర్దుకొని ముందు గదిలో భర్తతో కబుర్లేసుకూర్చుంది.

'తొమ్మిది దాటినట్లుంది. ఈ పూటకు చదువు సున్నా! నిక్షేపంలాంటి మూడ్ పాడుచేశాడు. మహానుభావుడు.' అని విసుక్కుంది సుజాత!

ఆ విసుగంతా విక్టర్‌మీద!

లైటార్పి నిద్ర కుపక్రమించిందిగాని ... అదీ సాధ్యపడలేదు.

'ఎంత ధైర్యం...' అనుకుంది మళ్ళీ!

అతని తెగింపుకు కోపం తెచ్చుకోవడానికి ప్రయత్నించిందిగాని, మనసు ఆమెతో సహకరించలేదు.

ఉత్తి చిరాకుమాత్రం మిగిలింది.

'సన్నగా... పొడవుగా... చామనఛాయ రంగు' విక్టర్ రూపం కళ్ళముందు మెదిలింది.

'అతను నవ్వితే కళ్ళు చిన్నవైపోతాయి. గమ్మత్తుగా.

అయితే కావచ్చు... కానీ, అతని గురించి తనకెందుకీ ఆలోచన?

'ఈ మాత్రమైనా కలుసుకున్నాం... అదే చాలు...' అతని మాటలు గిలిగింతలు పెట్టినట్లున్నాయి.

'ఏమిటట ... అతని అభిప్రాయం! పోకిరి మాటలు' అనుకుందే కానీ మనసంతా ఏదో తృప్తి.

'బుద్ధిమంతుడు. బడుద్ధాయి ...' అనుకుందేగాని ఇలా వెంటపడతాడని అనుకోలేదు.

ఆలోచనలలో గుర్తు చేసుకోవాలిట

ఎందుకూ... గుర్తుచేసుకోవడం?

అసలు ... అతన్ని మర్చిపోతేకదా. వేరే గుర్తు చేసుకోవడం! ఒక్కసారి ఎంత మార్పు.

ఆలోచనల్లోనే ... ఎప్పుడో నిద్ర పట్టేసింది.

* * *

ఉదయం లేచేసరికి బాగా ఆలస్యమైంది. ఆదరా బాదరా ముఖం కడుక్కోవడం పూర్తి చేసేంతలో వచ్చింది రజని!

"ఇప్పుడేనా లేవడం? అనుకున్నాన్లే.." అంది సుజాతని మోచేతో పొడిచి.

ఆమెను తన గదిలో కూర్చోబెట్టి ... క్షణంలో రెండు కప్పుల కాఫీతో తిరిగి వచ్చింది సుజాత!

"వేగిరం తయారుకా! మా యింటికి వెళ్దాం. నాన్నగారు ఉన్నపళంగా నిన్ను పిలుచుకు రమ్మన్నారు" అంది రజని కప్పు అందుకుంటూ!

సుజాత ఆశ్చర్యపోయింది. "నన్ను రమ్మన్నారా?"

రజని ఔనన్నట్లు తలూపి... "తరువాత తీరుబడిగా ఆలోచిద్దువుగాని ముందు కదులు. మా యింట్లోనే భోజనం కానిచ్చి, అక్కడినుండలా కాలేజికి వెళ్ళిపోదాం ..." అంది.

సుజాత మరి మాట్లాడకుండా స్నానానికి వెళ్ళిపోయింది.

సుజాత అటు వెళ్ళగానే ఊడిపడ్డాడు మురళి!

"ఓహో... మీరా! సుప్రభాతం.

# సరియైన భక్తి

**ధర్మపథం —బులుసు వేంకటరమణయ్య**

భగవంతునిపై పాటలు పాడేవారినీ, స్తోత్రాలు పఠించేవారిని చూచి వారు భక్తులని భావిస్తాము. దేవాలయానికి విధిగా వెళుతూ, పూజలు చేస్తూ, చేయిస్తూ ఉండే వారిని గొప్పభక్తులని అనుకొంటున్నాము వారిలో నిజమైన భక్తులూ ఉండవచ్చు తాము భక్తులమని లోకానికి వెల్లడించడానికి ఆ రీతిగా ప్రవర్తించేవారూ ఉండవచ్చును.

నిజానికి భక్తి అంటే భగవంతుణ్ణి గౌరవించడం, స్తుతించడం, ఆయనమీద పాటలు పాడడం కాదు. కేవలం పూజించడం కూడా భక్తి అనిపించుకోదు.

మనం పూజాద్రవ్యాలను తీసుకుని గుడికి వెళ్లి అర్చకుని ద్వారా పూజ చేయిస్తాం. మన గోత్రనామాలతో అతడు పూజచేస్తే మనం స్వయంగా పూజ చేసినట్లే సంతోషిస్తాము. శ్రీమంతులైనవారు విలువైన వస్తువులు భగవంతునికి సమర్పిస్తూ తృప్తి పడతారు. కాని, యివి యేవి నిజమైన భక్తి చిహ్నాలు కావు. వీటివల్ల భగవంతుడు తృప్తి పడడు.

అయితే భక్తిఅనేది యేమిటని ప్రశ్న కలుగుతుంది—

భగవంతుణ్ణి ప్రేమించడమే నిజమైన భక్తి. దానికి పూజాద్రవ్యాలతోనూ కానుకలతోనూ పనిలేదు. దేవునికి మనకూ పూజారి వంటి మధ్యవర్తి అవసరమూలేదు. గుడిలో విగ్రహం ఎదుటనే నిలవనక్కరలేదు. దూరం, దగ్గరాఅనే మాటలేదు. పరిశుద్ధహృదయంతో భగవంతుణ్ణి ప్రేమించడమే సరియైన భక్తి అట్టిభక్తివుంటే దేవుడు మనపై కరుణించి వాత్సల్యాన్ని చూపుతాడు. తమ బిడ్డలు చేసిన తప్పులను తలిదండ్రులు క్షమించినట్లే తన్ను ప్రేమించిన వారి తప్పులను క్షమిస్తాడు

భగవంతునికి ఆకారంలేదు. అతడు నిరాకారుడైన శక్తి. ఆ రీతిని రూపం లేనివానిని ప్రేమించడమనేది కుదురుతుందా? కుదరదు. అందువల్లనే ఆ శక్తికి నామరూపాలు కల్పించబడుతున్నవి. భగవంతుడు సాకారుడై అవతరించినప్పుడు ఆ అవతార పురుషునిపై ఉంచిన విశ్వాసమే సరియైన భక్తి. అట్టి భక్తి వున్నప్పుడు భగవంతునికి మనపై వాత్సల్యం, కరుణ ఉంటాయి. ఆత్మ తృప్తికోసం అతనికి పత్రం, పుష్పం, ఫలం, తోయం ఏదైనా ఇవ్వవచ్చు. ఇవ్వకపోయినా బాధలేదు, హృదయం భక్తి పరిపూర్ణమై ఉంటే చాలును.

భగవంతుణ్ణి మనం ప్రేమిస్తే అంతకంటే ఎన్నోరెట్లు అధికంగా అతడు మనల్ని ప్రేమిస్తాడు. మనం కష్టాలలో ఉన్నప్పుడు గమనించి, వాటినుండి మనలను తప్పిస్తాడు: అవసరమైనప్పుడు మనకష్టాలను మనకు బదులుగా తాను అనుభవిస్తాడు. మనకు కనబడకుండా మననీడవలెనే మనవెంట ఉంటాడు.

ఏదో ఒక కోరిక పెట్టుకొని, అది నెరవేర్చవలెననే సంకల్పంతో చూపే భక్తి ఎంతమాత్రమూ భక్తిఅనిపించుకోదు. నిష్కల్మషమైన భక్తికి కోరికతో ఎట్టి సంబంధమూ ఉండకూడదు.

పైవిధంగా ఉండేదే అసలైన భక్తి, సిసలైనభక్తి.

---

ఏమిటి సంగతి ఇంత పొద్దున్నే పావనం చేశారు మా గృహాన్ని'' అన్నాడు.

''సుజాతకోసం...''

''రక్షించారు. నాకోసమేమోనని హడలి చచ్చాను'' అని గట్టిగా నవ్వి ''కోప్పడకండి మేడమ్... చిన్న జోకు!'' అన్నాడు మురళి!

''ఏడ్చినట్లుంది... బోడి జోకు!''

''థేంక్స్ ఫర్ ద కాంప్లిమెంట్. మీకివే నా జోహార్లు! అది సరే పనిగట్టుకు కోడి కూయకముందే విచ్చేశారంటే ఏదో విశేషమే ఉండాలి. ఏదైనా ప్రోగ్రామా? కొంపదీసి పిక్నిక్ పార్టీకాదు కదా!''

''ఏం? పిలియితే మా వెంటపడాలనా? మా అమ్మాయిలు ఈమధ్య రౌడీలైపోయారు. ఎందుకైనా మంచిది. బీకేర్ ఫుల్'' రజని బెదిరించినట్లు అంది.

''మీ వెంటపడే ఖర్మ నాకేం. నాకు వేరే పని లేదనుకున్నారా?''

''ఆహా... లేకేం నాటకాలున్నాయిగా!''

''నాటకాలంటే మీకెందుకీ వెటకారం? అసలు నన్నడిగితే'' మురళి మాటలు పూర్తి చేయనివ్వకుండా అంది రజని!

''మిమ్మల్నెవరడిగారు? ఇక చాలు, నాటకాల బోరు.''

''బోరు?'' అంటూ ఆశ్చర్యాన్ని ప్రకటించి ''బొత్తిగా కళాత్మక హృదయం లేదు మీకు. మీకేకాదు. మీ ఆడవాళ్లెవరికీ లేదు దురదృష్టవశాత్తు! ఐ పిటీ యూ- పూర్ కీచర్స్'' అని జాలిపడ్డాడు మురళి!

రజని ఏదో మాట్లాడబోయే టంతలో రామం వచ్చాడు. గదిలో రజనిని చూసి తడబడి రెండడుగులు వెనక్కివేసి 'సుజీ... ఏదిరా?'' అంటూ అడిగాడు మురళిని!

''లేదు. స్నానానికి వెళ్లింది. ఈవిడగారు వచ్చారుగా. అంటే ఏటో లాక్కుపోతుందన్న మాట'' అన్నాడు మురళి!

రామం తలూపి రజనివైపొకసారి చూసి వెళిపోయాడు.

''మీ అన్నయ్యగారు, మీకంటే చాలా నయం. చూడండి ఎంత బుద్ధిగా వెళ్లిపోయారో'' అంది రజని!

''వాడి నేవరే అంత'' అని రజని వైపు అనుమానంగా చూసి ''అంటే మీ అర్థం నన్నిక్కడ నుండి పొమ్మనేగా'' అన్నాడు మురళి!

''ఇంకా వేరే చెప్పాలా?''

''గుడ్ గాడ్! ఎంత అవమానం. ఈ మురళీ మాట్లాడ్డమే ఓ పెద్ద ఎడ్యు-కేషన్ అనుకుంటారే అందరూ! అటువంటిది మీరు.. ఇంతటి అవమానమా... సహించను''

''మీ గిరీశం డైలాగులకేంగాని కొత్త నాటకాలేమైనా వేస్తున్నారా?'' మురళికి ఈ మాటలతో హుషారు వచ్చింది ''ఒక్కటేమిటీ? చాలా వేస్తున్నాం. పగిలిన సీసా, పగలని హృదయం, మాటేసిన పులి, కాటేసిన సర్పం...''

''ఆపండి ఆపండి'' రజని అసహనంగా అంది ''ఏమిటివన్నీ? ఏదో డిటెక్టివ్ నవలల పేర్లలా ఉన్నాయిగాని, నాటకాల పేర్లలా లేవు. ఈ పేర్లలాగే ఉంటాయా మీ నాటకాలు కూడా...''

''ఏం? పేర్లు బాగాలేవా? అయినా... పేరులో ఏముంది చెప్పండి. ఏదైనా నాట

22–7–1977 శుక్రవారం మొదలు
28–7–1977 గురువారం వరకు

# వారఫలం

మహేష్

**మేషం:**— భాగస్వాములతో కలిసిచేసే వ్యాపారాలు బాగుంటాయి. రావలసిన డబ్బు అందుతుంది. మీ ఆలోచనలు ఫలిస్తాయి. వారం ఆఖరులో ఫలితంలేని శ్రమకలుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అనవసరమైన వ్యయం జరుగుతుంది.

**వృషభం:**—మీ అంచనాలు తారుమారు కాగలవు. సాటివారితో వాద ప్రతివాదాలు తగవు. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**మిథునం:**— వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. ఇతరుల నిమిత్తం శ్రమ పొందవలసివస్తుంది. స్త్రీలకు— ప్రయాణాలు వాయిదా పడతాయి. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**కర్కాటకం:**— మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. ప్రయాణాలు వాయిదా పడతాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొహమాటాలు తగవు. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. సాహసిక వ్యవహారాలు లాభింపగలవు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. బంధుమిత్రులనుకలుసుకొంటారు.

**సింహం:**— మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. ముమ్ముందు బాధ్యతను కలిగించే వాగ్దానాలు చేయడం తగదు. స్త్రీలకు— పుణ్యకార్యాలు చేస్తారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కన్య:**— ప్రయోజనసంగల పరిచయాలు ఏర్పడతాయి. మీ ఆలోచనలు ఫలిస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వృత్తిలో సాటివారి పోటీ తగ్గుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**తుల:**— ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. ప్రయాణాలోచనలు చేస్తారు. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. విలాస వస్తువులు కొంటారు.

**వృశ్చికం:**— మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. వృత్తిలో శ్రమ కలుగుతుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. సాటివారిలో గౌరవం లభిస్తుంది. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**ధనుస్సు:**— సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభించగలదు. వారం ఆఖరులో శ్రమ కలుగుతుంది. చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మకరం:**— మీ కార్యక్రమాలు అనుకొన్నట్లుగా నెరవేరతాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. మీరు ఇదివరకు చేసిన ప్రయత్నాలుఫలిస్తాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**కుంభం:**— రావలసిన డబ్బు అందుతుంది. వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. నూతన విషయాలను తెలుసుకొంటారు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. స్త్రీలకు— బంధుమిత్రులకు సహాయం చేస్తారు. సంతోషకరమైన వార్తలను వింటారు.

**మీనం:**— చికాకులకు గురికాగలరు. వృత్తిలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. ఆందోళన కలుగుతుంది. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు అనుకూలంగా ఉంటాయి. రావలసిన డబ్బు అందగలదు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

---

కానీకిగాని, నటుడికిగాని పేరు రావాలంటే... ముందు 'ఫేటు, కలిసి రావాలి'' అన్నాడు మురళి!

''చివరికి నాటకాల వాళ్లకు కూడ... వేదాంతం తప్పలేదు ..'' రజని జాలిపడింది.

''మీరు జాలిపడ్డారు కాబట్టే ఉన్నమాట చెప్తాను'' మురళి అన్నాడు. ''ఎవరైనా రచయిత ఓ నవల వ్రాశాడనుకోండి. తను వ్రాసిన నవలకు ఎకాడమీ ప్రైజో... ఏదో రావాలని ఆశపడ్డాడే అనుకోండి. అప్పుడేం చేస్తాడో తెలుసా? తనకు తెలిసిన వారిని పట్టుకొని ఇన్‌ఫ్లుయన్స్ చేయించుకుంటాడు. అతను వ్రాసింది అందరికీ అర్థమయే సాహిత్యమైతే దానికేదో పేరున బహుమానం! ఒకవేళ ఎవరికీ అర్థంకానట్లు గజిబిజిగా ఉంటే అటువంటిదానికి 'ఉత్తమ

## తమసోమా జ్యోతిర్గమయ

బాలల సాహిత్యం' అని పేరుపెట్టి ఓ బహుమానాన్ని పారేయవచ్చు. ఎందుకంటే ... తెలుగులో చెప్పుకోదగినట్టి బాలల సాహిత్యపు పుస్తకాలు లేవు. పెద్దబాలశిక్ష మొదలు, మొల్ల రామాయణంవరకూ మీరు అంగీకరిస్తే బాలసాహిత్యమేఔతుంది. సరుకులేని పుస్తకమయితే మరీ మంచిది. బాల సాహిత్యాన్ని సాధారణంగా ఎవరూ పట్టించుకోరు.

''ఇక మా నాటకాలుకూడా అదే తీరులో ఉన్నాయి. ఎవడికో బుద్ధిపుడుతుంది. ఓ పరిషత్ స్థాపించేసి కళాసేవ చేసేయాలని. అంతే! నలుగుర్ని పోగేసుకొని చందాలు వసూలుచేసి స్టేజి అనబడే ఓ అరుగును చూసుకొని దానికేవో నాలుగు చింకి పాతలు వేలాడదీసి 'రంగస్థలం' అని పేరుపెట్టేస్తాడు దానికి! తరువాత ఆహ్వానాలు విధ చిన్నా, పెద్ద నాటక సమాజాలకు! వాళ్ళు ఓ రెండు రోజుల్లో తయారయిపోతారు. ఇది పోటీలకు ముందు జరిగే కార్యక్రమం.

''ఇక పోటీలు మొదలయాక మొదలవుతుంది అసలు కార్యక్రమం. నాటకాలపోటీ కంటే చురుగ్గా పోటా, పోటీలుపడి ఎవరికి వారే జడ్జీలకు సిఫార్సులు పట్టుకొస్తారు. ఇది సర్వసాధారణం. ప్రతివాడికి, ముఖానికి రంగేసుకొని నటుడిగా చలామణి అయిపోవాలనే తాపత్రయమేగాని అసలు నటనంటే ఏమిటి? దాని లోతెంత? అని తరచి చూడాలనే జిజ్ఞాసే ఉండదు. కళాసేవ, కళాపోషణ,,, అంటే చివరికి ఈ స్థితికి దిగ

జారిపోయింది ఈనాడు. ఒకప్పుడు ఆంధ్ర నాటక కళారంగం అత్యున్నత స్థితిలో వెలిగింది. ఈనాడు ఆ పాత ఛాయలు మచ్చుకైనా లేవు. కారణమేమిటంటారు ?'' అన్నాడు మురళి తన ఉపన్యాసాన్ని ఆపి ... ఊపిరి పీల్చుకొని !''

''నాకేం తెలుస్తుంది ? మీరే చెప్పండి''

''కారణం వెరీ సింపిల్ ! అసలు నాటక కళంటే, ప్రజలలో ఆదరాభి మానాలు తగ్గిపోయాయి, ఈ సినిమాలు వచ్చాక ! ఎంత చవకబారు సాహిత్యాన్నయినా రంగులు పులిమి, మసిపూసి మారేడుకాయను చేసి 'మా అపూర్వ కళాసృష్టి' అంటూ జనాలో వదిలేస్తారు. వీళ్లేమో పైపై రంగులకు, హంగులకు, పిచ్చి చేష్టలకు, సిగ్గులేని శృంగారానికి, అర్థంలేని షోకులకు మురిసిపోయి. వేలంవెర్రిలా విరగబడి చూస్తారు'' మురళి అన్నాడు.

''మంచి నాటకాలు వేస్తే ప్రజలు చూస్తారేమో ?'' అంది రజని.

'అంటే మంచి నాటకాలు తెలుగులో లేవంటారా ? గొల్లపూడి, రావిశాస్త్రి, పాలగు, నంది, మొదలైనవారు చాలా మంచి నాటకాలే వ్రాశారు. ఎంత మంచి నాటకమయినా దాన్ని రంగుల్లో చూపించలేం. ఆ టెక్నికల్ ఎఫెక్ట్స్ నాటకాల్లో లేవడం కష్టం.'

ఇంతలో సుజాత స్నానంచేసి, డ్రస్ చేసుకొని వచ్చింది.

'నీ నాటకాలతో దాన్ని హడలగొట్టావా?' అంది వస్తూనే నవ్వి !

'సమయానికి వచ్చావు. కాస్త ఆలస్యమైఉంటే ఇటు నుండి యిటే నా శవం వావుల మడుంకు వెళ్లిపోను' అంది రజని.

'అన్యాయం. అయినా మిమ్మల్ని అనుకొని ఏంలాభం ఈ రోజుల్లో నాటకాల విలువే యింత' అని. 'ఓపిగ్గా విన్నందుకు థాంక్స్. వస్తాను' అని వెళ్లిపోయాడు మురళి.

ఇద్దరూ నవ్వుకున్నారు.

రజని వాళ్ల యింటికి వెళ్లేసరికి ముందు హాలులో కూర్చొని పేపరు చూస్తున్నారు, శివరావుగారు.

''రామ్మా ! ఇలావచ్చి కూర్చో' అన్నారు, సుజాతను చూడగానే.

సుజాత పక్కనే రజని కూడా కూర్చుంది.

'చూడమ్మా ! నీ తండ్రి వంటి వాడిని. నేనేదయినా నీ మనసుకు కష్టం కలిగించే మాటంటే అన్యదా భావించకు. నీతో ఓ ముఖ్యమైన విషయం మాట్లాడాలని పిలిపించాను' అన్నారు శివరావుగారు తను చెప్పబోయే దానికి ఉపోద్ఘాతంగా.

ఆయన మాటలకు సుజాత తెల్లబోయింది.

'నేను అన్యథా భావించే విషయమేముంటుంది ?' అనుకుంది. గుబగుబలాడుతున్న గుండెను చిక్కబట్టుకొని ''చెప్పండి పరవాలేదు'' అంది.

ఆయన చేతిలోని పేపరు మడిచి, పక్కన పెట్టి సుజాత వైపొకసారి నిశితంగా చూసి అన్నారు !

''మేమొక బ్రాంచిని ప్రారంభిస్తున్నామని నీకు తెలిసే ఉంటుంది. ఆ షాపులో పని చేయడానికి ఒక నమ్మకమైన వ్యక్తిని చూడమని బాబ్జీతో చెప్పాను. కానీ... నిన్నరాత్రి తెలిసింది నాకు... నీకో అన్నయ్య ఉన్నాడని, ఇంకా ఉద్యోగం ఏదీ దొరకలేదని. నా షాపులో ఉద్యోగం చిన్నదే! పేరుకు సేల్స్‌మేన్! కానీ నామోషీ పడవలసినదేమీ లేదు అందులో! కౌంటరులో కూర్చొని డబ్బు వ్యవహారాలు చూడ్డమే పని. మిగిలిన పనులు చూసేందుకు వేరే ఇద్దరు కుర్రాళ్ళుంటారు. ఎవరినైనా నమ్మకమైన వ్యక్తిని ఆ పనిలో పెట్టాలనుకున్నాను. ఎందుకంటే... అది డబ్బుతో వ్యవహారమున్న బాధ్యత. నెలకు రెండు, రెండు వందల యాభైవరకూ ఇవ్వాలని నా ఉద్దేశం. మీ అన్నయ్య అంగీకరిస్తే... అతన్నే వేసుకుంటాను. మీ అన్నయ్యే కాబట్టి మూడు వందల వరకూ ఇవ్వటానికి నాకు అభ్యంతరం లేదు. 'పిలిచి కొట్లో గుమాస్తా ఉద్యోగం ఇస్తానంటారా మాకు వేరే గతిలేనట్లు' అని మీరు అన్యథా భావించకండి; మీ నాన్నగారితో నేనీ మాట అన్నానని చెప్పు!'' మాటలు ఆపి సుజాత వైపు సాభిప్రాయంగా చూశారు.

సుజాత మౌనంగా తలూపింది.

''పేరుకు 'సేల్స్‌మేన్'' మా అబ్బాయి చేసేది అదే! ఎటొచ్చి అది వాడి సొంత వ్యాపారం మీ అన్నయ్య చేయబోయేది, వేరొకరి పని తేడా వుంది కాదనను: అయినా యిందులో చిన్నతనమేం లేదు వృత్తిగౌరవం ముఖ్యం. వృత్తానికి ఉద్యోగం ఎలానూ లేదు పోనీ యింకో మంచి ఉద్యోగం వచ్చే వరకూ చేయటానికి అభ్యంతరం ఏముంటుంది కానీ మీ యింటివాళ్లెవరు యిష్టపడకపోయినా, ఆమాటే నిర్మొహమాటంగా చెప్పొచ్చు. నేనేమీ అనుకోను అనుకోవటానికి ఇందులో ఏమీ లేదు కూడ'' అన్నారు శివరావుగారు!

''ఇందులో చిన్నతనమేముందండి. మా నాన్నగారితో, అన్నయ్యతో కూడా చెప్పి... ఏ విషయం మీకు రేపు చెప్తాను. మా ఇంటిలో ఎవరూ అభ్యంతరం చెప్తారని నేననుకోను. అయినా అన్నిటికంటే ముఖ్యం మా అన్నయ్య అభిప్రాయం''అంది సుజాత!

శివరావుగారు తలూపారు ''నిజమే రేపు కాకపోతే రెండు మూడు రోజుల్లో చెప్పినా ఫరవాలేదు'' అన్నారు.

(ఇంకా వుంది)



## రచయితలకు మనవి

కార్టూన్‌లతోను కథలతోను స్వంత చిరునామాగల స్టాంపులంటించిన కవరులు జతపరచకపోతే వాటిని తిప్పిపంపటం సాధ్యంకాదు. సం.



## అవీ - ఇవీ - అన్నీ

### చైతన్య కేతనం

సిద్దిపేట సాహితీ వికాస మండలి వారు ప్రచురించిన యువకవుల కవితా సంకలనం యిది. వచన కవిత్వంలో సాధన చేస్తున్న 29 మంది కవుల రచనలు వున్న ఈ పుస్తకం వెలరు 2. లు ప్రతులకు శ్రీనివాసా బుక్‌డిపో, మెయిన్‌రోడ్డు, సిద్దిపేట, మెదక్ జిల్లా.

### రెండు కళ్ళు

రచయిత — లక్ష్మీరమణ. శ్రీమతి సరోజనీనాయుడు, శ్రీమతి ఇందిరాగాంధీల జీవిత విశేషాలను హృద్యంగా చిత్రించిన ఈ పుస్తకం వెల రు 5. కాపీలకు ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, రాష్ట్రపతిరోడ్, సికింద్రాబాద్.

### గిడుగు రామమూర్తి

రచన : జి. వి. రామమూర్తి వ్యవహారిక భాషోద్యమ నాయకులలో ప్రముఖులైన గిడుగు రామమూర్తిగారి జీవితచరిత్ర విశేషాలతో సవివరంగా రూపొందించబడిన ఈ గ్రంథాన్ని ఆంధ్రప్రదేశ్ సమాచార పౌర సంబంధశాఖవారు ప్రచురించారు.

### భావమంజరి

శిద్దంసెట్టి రామసుబ్బయ్యగారి రచన ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ నుండి 1250 రూ.లు అందుకున్న ఆధునికకావ్యం. ప్రకాశకులు శ్రీ వెంగళసెట్టి రంగయ్య 22/257 దాడివారివీధి నెల్లూరు.

### మాణిక్యదీపిక

మినీకథల సంకలనం. సంకలనకర్త : శ్రీ కొడాలి సాంబశివరావు. 110 పేజీలు వెల 5 రూపాయలు. ప్రతులకు : శ్రీ రాజావాణి సాహితీ నిలయం. మహానంది [పోస్టు] నంద్యాల తాలూకా కర్నూలుజిల్లా. ప్రముఖ రచయితలవేకాక వర్ధమాన రచయితల మినీకథలు మొత్తం 50 ఉన్నాయి ఈ సంకలనంలో. ప్రతికథా ప్రయోగాత్మకంగా ఉండటమేకాక మంచి రసపుష్టిని కలిగివుంది. వర్ధమాన యువకథా రచయితలలోని శక్తి సామర్థ్యాలని వెలుగులోకి తేవడానికి యిలాంటి సంకలనాలు ఎంతైనా తోడ్పడతాయి.

### రాధ ఎదురుతెన్నులు

గేయ సంపుటి: రచన: శ్రీ మద్దిబోయిన పార్థసారథి. రాధ విరహాన్ని రసవత్తరంగా చిత్రీకరించిన 30 గేయాల సంపుటం యిది. వెల 2 రూపాయలు. ప్రతులకు: రచయిత 5.4.26 తహసీల్ ఆఫీసువద్ద నిజామాబాద్.

Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna